Pioneer Press:—Anantapur

శ్రీ

# సుగ్రీవపట్టాభిషేకము.

(శూర్పణఖా భంగము.)

5 అంకముల నాటకము.

గ్రంథకర్త.

కస్తూరి సుబ్బరావు,

—:(o):—

అనంతపురము.

స్వామివిలాస ముద్రాలయమందు ముద్రితము.

1919

సర్వస్వామ్యసంకలితము.) (వెల రు. 0—10—0 )

# అంకితము



గీ॥ రఘుకులాంబుధిసోమ! శ్రీరామచంద్ర!
చెలఁగి సుగ్రీవపట్టాభిషేక మనెడి।
నాటకమొనర్చి యొసఁగితి నయము మీరఁ।
ధరను సుబ్బరామయాఖ్యచే దనరువాఁడ।
గరుణఁ జేకొనుమయ్య పాకారివినుత!॥

# పీఠిక.

ఇదివరకు నేను "శకుంతలా - దుష్యంతము" అను నాటకంబొకటి రచియించి ప్రకటించియుంటిని. విశ్వోద్భవస్థితి విలయకారణ భూతుండును, సచ్చిదానంద స్వరూపుండును, పరమేశ్వరుండునైన, శ్రీమన్నారాయణుని లీలావతారంబులలో విశేషంబున గీర్తించినను, సకలపాప వినాశకరంబనియు, సకల మంగళకరంబనియు, సకలాభీష్టప్రదాయకంబనియు, నెల్లరకుఁ దెల్లంబైయున్నది. భగవంతుని యవతారంబులలో, లీలామానవ సుందరవిగ్రహుండగు శ్రీరామచంద్రునిచరిత్రము, రామాయణంబున, విస్తరంబుగ దెలుపఁబడియున్నది. శ్రీరాముడు దండకారణ్యంబు నొచ్చినది మొదలు, సుగ్రీవుని పట్టాభిషేకమువఱకు, నాటకరూపంబున నిప్పుడు రచించితిని. మఱియు సందర్భానుసారంబుగ నచ్చటచ్చట, భాస్కరాదికవిప్రణీతంబగు రామాయణమునందలి కొన్ని పద్యముల నుపయోగించియున్నాడ. ఈనాటకములోని పాటలెల్ల ననుబంధముగా నిందు ముద్రింపఁబడినవి. సంఖ్యనుబట్టి యాయాచోట్లం బాడుకొనవలయును. తెనుఁగు భాషయందు నాకుఁగల యల్పజ్ఞతచే దోషంబులుండవచ్చును. నన్నాదరించి భాషాభిమానులిందలి దోషంబులను దెలిపినచో, సంతసంబున సవరించుటకు సిద్ధముగనున్న.

అనంతపురం.
1st Jan. 19

కస్తూరి సుబ్బశాస్త్రి.

# ఈ నాటకమునందలి పాత్రములు.

## —పురుషులు.—

శ్రీరాముఁడు—కథానాయకుఁడు-దశరథుని పుత్రుఁడు.

లక్ష్మణుఁడు—శ్రీరామునితమ్ముఁడు.

ఖరుఁడు - దూషణుఁడు - త్రిశిరుఁడు—రాక్షసులు.

రావణుఁడు—లంకాధిపతి.

విభీషణుఁడు—రావణునితమ్ముఁడు.

అతికాయుఁడు - మహాకాయుఁడు - ఇంద్రజిత్తు—రావణునిపుత్రులు

ప్రహస్తుఁడు - మారీచుఁడు—రావణునిమంత్రులు.

జటాయువు—పక్షిరాజు.

వాలి—కిష్కింధాధిపతి.

సుగ్రీవుఁడు—వాలితమ్ముఁడు.

అంగదుఁడు—వాలిపుత్రుఁడు.

హనుమంతుఁడు—సుగ్రీవునిమంత్రి.

1, 2, 3,—ముని



## స్త్రీలు.

సీతాదేవి—కథానాయకి - శ్రీరామునిభార్య.

శూర్పణఖ—రావణునిచెల్లెలు.

శబరి—తపస్విని.

తార—వాలిభార్య.

అప్సరసలు—దేవాంగనలు.



శ్రీరామచంద్రాయనమః

# సుగ్రీవ పట్టాభిషేకము.



## —నాంది.—

సూత్ర-- శా॥ శ్రీరాజిల్లఁబసిండి మంటపమునన్ సీతాసతీయుక్తుఁడై।
భారద్వాజవసిష్ఠమౌను లెలమిన్ భాషింపనానందుఁడై।
వీరాగ్రేసరుఁడౌ మరుత్సుతునకున్ వేదాంతసారాంశమిం।
పారం దెల్పెడు రాఘవుండొసగుతన్ భద్రంబు మీకెప్పుడున్.

## 1. అనుబంధము.

### ప్రథమాంకము—ప్రథమ రంగము.

అరణ్యము-పంచవటి-పర్ణశాల-రాముఁడు-సీత-ప్రవేశము.

రామ—సీతా! చిత్రకూటాద్రిఁ గాంచితివి కదా? ఆ నగేంద్ర మెట్లుండె?

సీత—అందు మునీశ్వరుల హోమ మంత్ర స్వరంబులు, గంధర్వుల గానంబులు, శుక పిక శారికల రవంబులు, సుగంధ పుష్ప తరు జాలంబుల పరిమళంబులు, నా యుల్లంబును జల్లవింపఁ జేయుచుండెను.

రామ—ఇందు సింహ శరభ శార్దూలాది కానన మృగరావంబులు నిశాచరవీరుల యట్టహాసంబులు కంటక వృక్షంబులు నీ యుల్లంబును దల్లడింపఁ జేయుచున్నవి కదా? (అని కొం లింపఁబోవ) తొలఁగి.

సీత—అరణ్యం బెంత భీకరంబైన నేమి? మీ చెంత నే నుండ నా కేమి భయము?

రామ—తరుణీ! మన మీ పంచవటికి వచ్చు మార్గములో జట యువు మనల నెదుర్కొని సఖ్యంబు వాటించి దండకారణ్య బున దైత్యుల రాకపోకడి విశేషంబుగాన నేమఱకుండుఁ డని వచించెను గదా? అంతకుముందు నీవు విరాధుండను క్రూర రాక్షసుని చేతఁ జిక్కి యెంత బెగులొందితివో కదా!

సీత—నాథా! ఆ ఘోర నిశాచరాధముని వీక్షించినంతనె నా ప్రాణంబులు వెడలు నట్లయ్యె-వాని బాహువుల నడుమ ని కొని యలసి సొలసి మూర్ఛిల్లితిని. లేచునంతలో మీ చెం నే నుంటిని. నాతోఁ బెంటి కెగసియున్న రాక్షసుని పట్టువ లించుక నే నేయపాయము లేకుండ నెటు వచ్చితినో చిత్రము నున్నది.

రామ—ఇంతీ! చిత్ర మేమి? నా వాడిశరంబులు వాని మేనుఁబలిగొ నాశనంబున నుండి నీవు పడుటఁగాంచి గారుడాస్త్రంబు నీ కే యుపాయంబును గలుగకుండునటుల నేఁగావించి సీతా! చిత్రకూటమును విడిచిన దాదిగ మన మే యే గ్రా శ్రమములఁ దాటి వచ్చితిమి?

సీత—ఇపుడు వాని నన్నియు నే నెట్లు చెప్పఁగలను?

రామ—నీ వయోధ్యాపురము కరిగిన పిదప నీ తోడివార లడుగ నిపుడే చెప్ప లేకున్న నపు డెట్లు చెప్పఁగలవు?

సీత—ఏమో నాకుఁ దోఁచినవి చెప్పెదను.

రామ——నానిసే చూతము చెప్పుము.

సీత——శరభంగాశ్రమము, సుతీక్ష్ణాశ్రమము, దాటివచ్చితిమి ఇదె పంచవటి.

రామ——(చిఱునవ్వుతో) ఇంత మాత్రమేనా?

సీత——(ఆలోచించి) ఆ! మఱచితి. అగస్త్యముని యాశ్రమము.

రామ——(మందహాసమున) అత్రిముని యాశ్రమమందుండ లేదా? సీతా! అనసూయ నీకుఁ గొన్ని ధర్మంబు లెఱిఁగించెఁ గదా? అవి నాకుఁ దెలుపఁగూడదనియా?

సీత——మీరెఱుఁగని ధర్మంబులెవ్వి? పతివ్రతా ధర్మములనే నాకుపదేశించినది. నాథా! ఆమె యెంతతపస్వినియో కాని నాకొసఁగిన వరములనేమందును. అంగరాగములు, వాడని పువ్వులు, మాయని మెఱుంగులు నాకిచ్చెను. ఆనాడుమొదలు నేఁటివఱకవి యిట్లేయున్నవి. (వణుకుచు) అబ్బా! అత్యంతదయంబైనను చలి మిక్కుటముగానున్నదే?

రామ——నలుదిశలు తెలిపట్టు చేఁగప్పఁబడినట్లు మంచావరించియున్నది. మఱియు మంచుబిందువులు ముత్యములట్లు కానుపించుచున్నవి.

గీ॥ మించుఘాసంబు పైఁ బాలుమంచుబొట్లు।
ముత్యముల రీతి గనుపట్టెముదిత! చూడ।
ఇవము వ్యాపించె దిశలెల్ల నింపుమీఱ।
ధాత్రిదేవేరి వలిపంబుఁ దాల్చినట్లు॥

ఉ॥ అల్లదెచూడు తేనసతి? రయంబున దాటుచు సైకతంబులన్
ఉల్లములుల్లసిల్లగను నుగ్గొనరించుచు వృక్షశాఖలన్
మెల్లన గాలిమీనదిని మేనులుముంప గడంకనిసువే
ల్లన దాఁకఘీంకృతులు సల్పుచుఁ బాఱెడు దంతియూధముల్.

జానకీ! నా వెంట వచ్చుట చేతగదా? చలి నెలలందు సైతః నారచీరలు కట్టి మృగ చర్మంబులపైఁ బరుండి ఫలంబులాహారంబుగఁ గొని భూషణంబులు మాని యడవులం బడి యిడుమలం గుడువ-అయోధ్యయందే యుండిన నీకిట్టి కష్టంబు లెవ్వియు లేకుండునుగదా?

సీత——ఉ॥ ఒల్లను సౌధజాలముల నొల్లను దివ్యసుగంధ ద్రవ్యముల్
నొల్లను స్వర్గ సంపదల నొల్ల హిరణ్మయభూషణంబులన్
ఫుల్లసరోజనేత్ర! రఘుపుంగవ! మీ పద సేవ చాలు నా
యుల్లము పల్లవింప మది నొల్లని కేమియును ప్రాణవల్లభా!

ప్రాణేశ్వరా! మీ రెచ్చట నున్న నాకదియే యయోధ్య కృష్ణాజినంబె హంసతూలికా తల్పము. ఈపర్ణకుటీరమే సౌధాంతరము. మిమ్ముఁ బాసిన దినము మహాకల్పమైయుండు.

రామ——నేనూరక నట్లంటిఁ గాని నీ యుదంతము నాకు దెలియదా నేను మాత్రము నిన్ను దబాయగలనా? సీతా! ప్రాతఃకాలమున నే ఫలంబులకై వెళ్ళిన లక్ష్మణుండింకను రాక తడవు జేసెనో? తోచకున్నది.

(దూరమున లక్ష్మణుఁడు ప్రవేశము.)

2 అనుబంధము.

లక్ష్మ——(తనలో) అక్కటా! ఫలంబులకై నేనంత దవ్వేల బోతి ఆఖడ్గమేలనా కంటఁబడె? నే నేల వానిఁ గైకొని వెదురుగుమురును ఖండించితిని? ప్రవేటునందుండు మునివరియునకు దాకి జమునిమందిరంబునకుఁ జనియెగదా? హా దైవమా ఈ ఘోరపాతకంబే రూపంబున బాపుకొనువాడ. శ్రీరాముని శరణంబు జొచ్చెదగాక (అని సమీపించి నమస్కరించును

రామ—(లేవనెత్తి) గీ॥ నిర్మలుండవు తలపంగ నీతిమతివి
సరసుడవు భూరివిక్రమశాలివరయ
ధర్మమార్గంబు నెందైన దప్పవెపుడు
అన్న నీముఖమేల కో చిన్నవోయె॥

లక్ష్మణా! నీముఖమేల విన్నఁబోయెఁ? కన్నీరు మున్నీరుగ నుబికిపొరలు టేల? ప్రమాదవశంబునఁ జేయరాని కృత్యంబేమైన నొనర్చితివా? మునీశ్వరులకేమైన నపకారమాచరించితివా? శత్రువులకు వెన్నిచ్చి పాఱితివా? దుఃఖింప నేల?

లక్ష్మ— కం॥ అక్కట మతిహీనుఁడనై
నిక్కము గానంగ లేక నేనొక తపసిన్
జిక్కని పొదమాటుండఁగ
గ్రక్కున ఖండించి పాపకర్ముఁడ నైతిన్॥

అన్నా! పక్వఫలంబులకై నే వనంబునఁ దిరుగుచుండ నొక ఖడ్గమాకసంబున మెఱుఁగుచుండెను. నేనా ఖడ్గమందుకొని చేరువనున్న వెదురు జొంపును నఱికితిని. నే వేసిన వ్రేటందుండు మునివరుని కంఠంబుఁదాక ధరణింబడి ప్రాణంబులు విడిచెను.

రామ—"హరి హరీ" (యని కర్ణములు మూయుచు శిరము వంచి చింతాక్రాంతుఁడై యుండ మునీశ్వరుల ప్రవేశము.)

1 ముని—రామచంద్రా! ఏల దుఃఖించెదవు? లోకకంటకుఁడగు దశకంఠుని చెల్లెలికొడుకు జంబుమాలి యనువాఁ డాఖండలునిఁ గూర్చి ఘోరతపంబు సల్ప వాని తపంబునకు మెచ్చి దివ్యఖడ్గము బంపిన వాఁ డొల్లకున్న మింట మెలఁగుచుండెను. లక్ష్మణుఁ డాఖడ్గముఁ గైకొని యా రాక్షసునిఁ దెగటార్చి లోకంబులకు మేలు గావించె. ఆతనికే దోషంబు లంటవు.

2 ము. ని—రాజేంద్రా! ఈ దుష్ట రాక్షసుని సంహరించి మాకు మే లొనరించితిరి. మా యాశ్రమంబులకు మేము వెళ్ళెదము.

రామ—తపోధనులార! బ్రహ్మహత్యాపాతకంబునకై వెఱచితిని. మీ వలన నిశాచరుఁడని యెఱుంగుటకు సంతసించితిని. పోయిరండు. (మునులు నిష్క—.) అవనికపడును.

ప్రథమాంకము—ద్వితీయ రంగము.

(అరణ్యము-బోనపుట్టికఁదలపై నిడుకొని శూర్పణఖ ప్రవేశము.)

3. అ ను బం ధ ము.

శూర్ప—లోకంబున నా కొడుకువంటి కొడుకుండునా? తలిదండ్రుల యందెంత భక్తి సలుపుచుండును. ఆరు నెలల గర్భము నే దాల్చి యుండఁగదా? నా పతియగు విద్యుజ్జిహ్వుని నా యన్న చంపినది. తండ్రి నెఱుఁగకున్నను భక్తిచేగదా? పగ దీర్చు కొనుటకై ఘోరతపంబొనర్చుచున్నవాఁడు. భళిరే! అనతికాలంబున నేవాసవునిచే వరంబులఁగైకొని యాదశకంఠుని కంఠంబు లుత్తరించి లంకారాజ్యంబవలీల నేలగలఁడు. అప్పుడు గదా? మందోదరి మొదలగు పదినెలందఱు నే నరుగుదెంచిన వెంటనే "శూర్పణఖ దేవిగారు" రండు, యీ శిరస్సుపై సలంకరింపుఁడని భయభక్తులచే నిలువఁబడి యెప్పుడే మాట నా నోటవెడలునో యని గుండెలఱచేత నుంచుకొనినన్గాచియుందురు. అప్పుడుగదా? దేవాంతక, నరాంతక, అతికాయుఁడు, మహాకాయుఁడు, ఇంద్రజిత్తు మొదలగు వారు నా యాజ్ఞకువేచి నా పంచలఁబడియుండుదురు. నేను హంసతూలికా తల్పంబునఁబరుండ సులోచన మొదలగు కాంతలు నన్నుఁజేరి నా పాదంబు లొత్తుచుందురు అప్పుడుగదా? నా సౌఖ్యము మిన్నందుట. అప్పుడు గదా

లంకారాజ్యంబునకు మహారాజ్ఞిబోలె యొప్పియుండుట. అప్పుడు గదా? నా యానందము. అప్పుడు గదా? నా భోగము అప్పుడు గదా? నా ప్రమోదము. నా సుభగత్వము. నా విలాసము. (హాహాహాహాహాహా పెద్ద నవ్వు నవ్వును.)

(పొద సమీపించి వెలుపలఁ దెగి పడియున్న కొమరుని శరీరముఁ గాంచి పెద్దపెట్టున రోదనముతో)

హా పుత్రా! ధృఢగాత్రా! ఇప్పుడే గదా? నేనెన్నో కోరికలచే సంతసించితిని. నావంటి దౌర్భాగ్యురాలు కట్టికోరిక లీడేరునా? నే నెట్టివేళ జన్మించితినో కాని, పతిని జంపుకొని జీవించితి. ఇప్పుడు సుతుఁడు మృతిఁబొందినను నా దేహంబున ప్రాణంబుల నిల్పుకొని మొండి బ్రతుకు బ్రతుకు పొమ్మని బ్రహ్మ వ్రాసియుండనోపు. లేకున్న నాకీ దుఃఖమేల ప్రాప్తించును? హా తనయా! నిష్కారణంబున నీ శిరమేల ఖండింపఁబడియె? ఏ సంగతిఁ బోక నిశ్చలతపంబొనర్చుచుంటివి కదా? ఏయుపకారం బెవనికిఁ గావింపక సమాధినుండగనే క్రూరాత్ముఁడెవఁడో నీ ప్రాణంబులను హరించె. హా కుమారా! నిర్జరేంద్రుని మెప్పువడసి పితరుని పగఁ దీర్చుటకునై పంక్తికంఠునిఁ దెగటార్చి మహాతేజా లంకారాజ్యంబవలీల నేలెదవని నమ్మియుంటినే? నా కోరికలెల్ల ఫలింపఁజేయుదువని విశ్వసించి యుంటినే? అక్కటా! దైవంబెంత నాపైఁ జలపట్టె? ఇఁక పుత్ర శోకం బెట్లు భరింతు? భర్తనెడబాసినను పుత్రునిఁ జూచుకొని సంతసించుచుంటినే? నా సంతసము నేటితో నడంగెను గదా? అను దినము తలఁచి దప్పకుండ నంజూడు నే దెచ్చి కడుపారఁ బెట్టుచుంటినే? ఇఁక నే నెవ్వనికై యుందును? ఎవనికిఁ గొని వత్తును? (యోచించి) మించిన కార్యంబునకు వగచి ప్రయోజనంబేమి? (కోపారుణ నేత్రయై) ఔరా! నా పుత్రుఁడు జీవించియుండిన బ్రాణాపాయంబగు నీ వనము నందుండు మునితులువలే యెవని చేతనో చంపించియుందురు. ఇందుకు సందేహంబే లేదు. ఈ క్షణంబునఁ జని వారి నందఱిని యమకాలుఁ డ

దిను ముద్దఁజేసి నోటవేసి కొనియెద. అప్పుడుగదా? నా ప్రతాపంబు వారలకుఁదెలియును. పోయెదగాక (నిష్క్ర.)

ప్రథమాంకము-తృతీయరంగము.

(మునులు తపోనిష్ఠచేనుండ శూర్పణఖ ప్రవేశము.)

శూర్ప—ఓ మునిముచ్చులార! కన్నులు మూసికొని పాలుఁద్రాగు పిల్లి చందంబున నెవరికిఁ దెలియదని తపముఁజేయువారి వలె యుండిన మిమ్ముల విడుతునను కొంటిరా? విడుచుదా ననుగాను. (అర్భటించుచు) నా కొడుకు నెవరు రాతెగ టార్చినది? నిక్కముగ జెప్పుడు. లేకున్న నా సంతాపంబాను నట్లు మిమ్ముల నందఱినిఁ బట్టిమింగెదను.

1 ముని—అమ్మా! శాంతింపుము శాంతింపుము. ఇందు మా తప్పి మియు లేదు.

శూర్ప—హుం. శాంతమా? ప్రాణాంతమా? ఏమిరా వచెరెదవు?

2 ముని—దైత్యజననీ! ఇవ్వనంబున నొక్క మునివేష ధారుఁడగు రాకొమరుఁడు నీతనయునిఁ జంపి ఫలములు కొన్ని చేకొని పర్ణశాలకిపుడే యిట్లుపోయెను. (చెయ్యిచూపును.)

శూర్ప—(రోషమున) ఎవఁడా మనుజాధముఁడు? వానింజక్కాడెదఁ గాక (నిష్క్ర.)

3 ముని—నీకుఁదగిన శాంతి రామలక్ష్మణులు చేయుదురులే, పో.

1 ముని—చేయుటయేకాదు. ఎప్పటికి మఱవురాకుండు గుర్తు పెట్టక మానరు. రావణుని కులనాశనమున కిదియే మూలకారణము. (నిష్క్ర.)

ప్రథమాంకము-చతుర్థరంగము.

(పంచవటి-పర్ణశాల-రాముఁడు-సీత.)

రామ—సీతా! నీచే ననుదినంబు నీరునింపఁబడి పెంపొందిన మల్లెలు మొల్లలు జాజులు గులాబి పుష్పములు వికసించి సువాసన

తెట్లు వెదజల్లుచున్నవో చూచుము? నీవేల ముడుచుకొనరాదు?

సీత——నాథా! సకల భోగంబులు విడనాడి యరణ్యంబున పదునాల్గు వత్సరంబులు తాపసవృత్తిచే నుండునట్లు త్త కైకేయి కట్టడఁజేసి పంపినది. కాన నేనిపుడా పుష్పంబులేల ధరించవలయు?

రామ——తాపస వృత్తి నాకుగాని నీకేల? నే జటాధారుఁడనై యుండ నీ జడను బుష్పములుండ గూడదని కాఁబోలు నీ తలంపు. నేనీ పువ్వులను ముడిచెద. (కొన్ని పువ్వులు శిరమందుంచ బోవ)

సీత——ప్రాణేశ్వరా! వాడని పువ్వులు నాకనసూయాదేవి యొసఁగి యుండ నీ పువ్వులేల? (రాముఁడు తొలఁగి నిలుచును.)

(ఒకవైపునుండి శూర్పణఖ ప్రవేశము. రాముని గాంచి సంతసమున)

శూర్ప——ఆహా! ఏమీ సౌందర్యము? లోకంబున నాబోటి సుందరాంగి కీతఁడు తగును. ఈతనికి నావంటి భార్య తగును గాని మఱియొకతైన మానికంబునకు మసిపేలిక జుట్టినట్లే యుండును.

(సీత వైపునకు దృష్టిసారించి) ఇంత నెవరా వికారభామిని? ఈ సుందరాంగుని సౌందర్యమంతయుఁజెడఁగొట్టుచున్నది. నే నాతని చెంతఁజేరిన నింకెంతవన్నియ హెచ్చునో కదా? నామాయచే వారల కగుపడకుండ నీ సుందరాంగుని చెంతఁజేరి చూచెదగాక. (అట్లే చేయును.)

(తనలో యోచించి) నే నీ రూపంబున బలుకరించిన నన్ను మెచ్చునా? మెచ్చడు. కాన కామరూపంబుగ్గైకొని యీ వన్నె కానిఁ గూడి హాయిగ నుండెద. నా పెనిమిటి నాఁడే పోయెను. ఇప్పుడు సుతుఁడు కూడాపోయెను. పోనీలే. ఈ మనోహరుని చెంత నున్నఁజాలు. (దూరము నుంచి చెంపలూడ్చి ముద్దిడి నిష్క్రమించును.)

(రాముఁడూరక నిలిచియుండ సీత సమీపించి హస్తము గ్రహించి.)

## 4. అనుబంధము.

సీత——మనోహరా! ఇంతలోనే మీకింత కోపమా? ఏల మాటాడరు?

రామ——నే ముడువఁదలఁచిన పుష్పాలే పనికిరాకున్న సీతో నాకేటి మాటలు?

సీత——శిరముపై వాడని పుష్పాలుండ నీ పుష్పాలేలయని యంటిఁగాని నే నొల్లనంటినా? మీ యిష్ట మెచ్చినన్ని కుసుమంబులు ముడువుఁడు.

రామ——(చిఱునవ్వుతో) అట్లయిన నీ శ్వేత గులాబి పుష్పము నుంచెదను. (పుష్పనుంచి)సీతా!నీ నీలకుంతలములపై యీ పుష్ప రాజమెట్లు రాజిల్లుచున్నదో? చూడుము.

గీ॥ నీలమణి భూషణంబున నిలిచి యుండు
పుష్యరాగంబు మాడ్కికి పోలువు మీఱి
నీలమైనట్టి కుంతల జాలమందు
మెఱయుచున్నది పుష్పంబు మానసే తా!

(శూర్పణఖ కామినీ రూపమున ప్రవేశము.)

శూర్ప—(తనలో) ముజ్జగంబందుండు కామినులు నా యీ లావణ్య రూపమునకు సాటివత్తురే? ఇప్పుడు గదా? యీ మోహనాకారుఁడు నావలలోఁజిక్కుట. ఇఁక నే దలఁచిన కార్యంబవశ్యంబు నెఱవేఱఁగలదు. (రాముని సమీపించి) రా కొమారా! నీ నామధేయంబెద్ది? నీ జనకుఁడెవ్వఁడు? ఇట్లు మునివేషధారుఁడవై శరచాపంబులన్బూని యింతి తోఁడ ఘోరారణ్యంబులనుండఁ గారణంబేమి?

రామ—(తనలో) ఈ రమణి విలాస వైఖరిం గాంచ నన్ను గామించి వచ్చినట్లున్నది. దీనిఁ బలుకరించి చూచెద. (ప్రకాశ) రమణీ! నా తండ్రి దశరథుఁడు. నన్ను రాముఁడందురు. ఈ పడఁతి నా పత్ని. నా తండ్రి యాజ్ఞచేయ నేనీ యరణ్యంబునఁ దపోవృత్తిచే గాలమును గడపుచున్నవాఁడ. నీ వెవ్వరి దానవు? నీ నామమెద్ది? నిన్నుఁగన్న పుణ్యుండెవ్వఁడు? ఆహా! ఏమి నీ లావణ్యము? నీ విలాసము? ఇట్టి రూపమే కాంతలందుఁగాన. నీ విపుడేల వచ్చితివి?

శూర్ప—(నవ్వుకొని తనలో) నీతో నే నొంటిగ ముచ్చటింపవచ్చితిని. నాసౌందర్యమునకు మెచ్చియున్నవాఁడు నన్నుఁ జేపట్టకమానునా? నా యుదంతమెఱిఁగించెద.

చం॥ "బలిమి జగత్త్రయంబుఁబలు బాములఁబెట్టుచు దేవతావళుల్
గలుకుఱఁబంక్తికంఠుఁడను పేరఁదనర్చిన దైత్యభర్తకుం
జెలియలఁబేరు శూర్పణఖ చెప్పెడిదేమి మహీశ నీకు నేఁ
గలసితి నిన్నుఁదక్కనొరుఁ గైకొన నీవును బాయుమీసరిన్"

మూఁడుజగంబులయందుఁ బ్రసిద్ధి వహించిన రావణాసురుని చెల్లెలను నా పేరు శూర్పణఖ. నీ రూపురేఖా విలాసంబులన్నియు

గాంచి నాకుందగిన పురుషుండవని యెంచివచ్చిన దాన. నీవే యూత్రను గాత్రించిన నా రూపమునుగైకొని నిన్ను మనోజకేళిందేల్చి మెప్పించెద. నీవువలచిన స్థలంబుల కనాయాసంబుగ దోడ్కొనిపోగలను.

౩. అనుబంధము.

(సీతను జూచి) ఇది రూపహీనురాలు. కొఱవమాలినట్టి యూందు దానితో నేమి సుఖమందగలవు? దీని నిపుడే హింసించెద. నన్ను బరిణయంబునం జేకొనుము.

రామ—(భీతిల్లు సీతను జెంతందీసి చిఱునవ్వుస) సుందరీ! నీ సౌంద ర్యమునకు మెచ్చితిని. అయిన ననునమ్మి నా వెంటవచ్చిన కాంతను విడుచుట ధర్మంబుగాదు. అటు చూడుము. నా సహోదరుండు లక్ష్మణుండు. నాంటిరూపవంతుండు. వానికిం దగిన సతి లేకున్నవాండు. పొమ్ము.

శూర్ప—(తనలో) ఔరా! వాని సోయగము. ఈ రామునికన్న నాతండే నాకుందగిన వాండు. పోయెదంగాక (నిష్క్ర)

(ముందుభాగమున లక్ష్మణుండు అటు ఇటు తిరుగుచుండ శూర్పణఖ ప్రవేశము.)

శూర్ప—లక్ష్మణా! నీయన్నను నే గామించినను బేలయై నీకుందగిన సతీమణి లేదని నీ కడకు నన్నంపియున్నాండు. నీవు కోరిన కామరూపము ధరించి నీ మనసున కెక్కునట్లు మెలంగు దాన.

లక్ష్మ—(తనలో) తన్నుం గామించి యుండిన చేడియను హాస్య మాడందలంచి యన్న నాపాలికిబంపి యుండనోపు. నేనును పరిహాసించెదను గాక (ప్రకాశ) రమణీ! నీ విలాసంబునకుం దగు వాండ నే గాను. ఈ జడలు, ఈ నారవల్కలాజినములు

నీకెట్లింపుగ నుండును? పొట్టకూటికై రామునిఁగొలిచి యున్న వాఁడ. ధనహీనుఁడను. నీవు కోరిన సౌఖ్యముఁ దేగల నా? చీరలు తేగలనా? ఏమి తేగలను. ఇట్టివానినిఁగూడి నీ వేమి సౌఖ్య మొందఁగలవు? రాముఁడో భూనాధుఁడు. నీ కోరిక లన్నియుఁదీర్పఁగలఁడు.

## 6. అనుబంధము.

శూర్ప—నీ పతిరూపవంతుఁడవనికదా? యింతగర్వము. నీకుఁదోడు నావంటి యువతి యుండిన నింకెంత రాణింతువో? లేకున్న నిర్మానుష్యంబైన సౌధంబు మాడ్కికదా? నీ విలాసము. విత్తహీనుఁడనైన రామునిఁగొలువనేల? నన్నుద్వాహంబైన నీవు కోరిన ధనముఁదేగలను. నా మాటవిని నా కోక ముద్దొసఁగుము. (ముద్దిడఁబోవ)

లక్ష్మ—(తొలఁగి) ఇంతీ? విలాసవంతులైనట్టి తరుణులు నావంటి భృత్యునిఁగోరుదురా? ఇంతకు నీ సౌందర్య గమన విలాసంబుఁజూడఁగోరి రాముఁడు నిన్నిటు పంపియున్నాఁడు.

క॥ "ఈమక్కి చెప్పు లీ మొగ
మీమెఱుపుం బాలుపుఁగలదె యేచెలువకు నీ
కోమలిక మెఱుఁగుటకునై
రాముఁడు మెలఁగించి చూచె గమనే నిన్నున్"

కాన నా మాటవిని యీసారి రామునిఁజేరుము. నీ నేర్పునకు మెచ్చి నిన్ను వరించును. శీఘ్రముగ వెళ్లుము.

శూర్ప—(తనలో) ఔరా! రాముఁడెంత మాయకారి? నా విలాసము జూచుటకా? నన్నిటు పంపినది. ఇంతి హరశ్యాముఁడు. సౌందర్య జిత కాముఁడు. రామాభి రాముఁడు. వానినే గూడెద గాక (స్వగతం)

(రాముఁడు-సీత-ఆసీనులై యుండ శూర్పణఖ ప్రవేశము.)

శూర్ప— సీ॥ పరిపూర్ణ కళలచే భాసిల్లు రేఱేని
ధిక్కరించెడు మోము తీరు గాంచి
కమల పత్రముకన్నఁ గడు సొంపుచేనొప్పు
నిండారు కన్నుల నీటుగాంచి
మదముచే నలరారు మత్తేభ హస్తంబుఁ
బోలు నీ కరముల పొందు గాంచి
నీల మేఘచ్ఛాయ నెనయుచుండెడి మేను
యందంబు మనసార నట్టె గాంచి

గీ॥ వలచి వచ్చితి మోహించి వసుమతీశ!
నన్ను జేకొని బ్రోవుము సన్నుతాంగ!
మనగ జాలను నేనింక మానవేంద్ర!
రక్ష సేయంగ నేటికి రామ! రామ!

మనోహరా! ఏల నన్ను పరిహాస పాత్రురాలంగ జేసెదవు? ఎవనిపేరు విన్న మాత్రముననే వేల్పులు భయాక్రాంతులై పాఱు చుందురు? ఎవని నామోచ్చారణమున రవి చంద్రులు బెగడువడి కాంతి హీనులౌదురు? ఎవని పరాక్రమమున జగత్త్రియంబు గడ గడ లాడుచుండును? అట్టి వాని చెలియలినైన నేను గామించి వచ్చి వేఁడుకొనిన నీ పూర్వ పుణ్యఫలంబని యేల దలఁపవు? ఏల రావు? ఏల సంతసముఁ దోపఁజేయవు? ఏలఁ గౌఁగిలింపవు?

6† అనుబంధము.

రామ—రమణీ! నాపైని నీ కెట్లు మోహంబు కలిగెనో నేనూహింపఁ జాల. రాజ్యచ్యుతుఁడనై వనవాసముఁ జేయుచున్నాఁడ. పేద జీకమన్న నాయందే బూనియున్నది. నివసించుట కీతాశ

పత్ర కుటీరంబే గాసి సౌధంబు సున్న-అందున నాపత్ని నన్నెడ బాయకుండ నెల్లప్పుడు నావెంట నరసి యుండును. ఇంత మాత్రము యోచింపలేవా?

7. అనుబంధము.

శూర్ప—రామా! నా మనోవాంఛిత ఫలకామా! ఏల నన్నా యాస బెట్టెదవు? ఒక్క సారి మనసారఁ గౌఁగిలింపనిమ్ము. (సమీపింప) (రాముఁడు తొలఁగ) ఏల దూరమగుచుంటి దవు? ఇంత నీవనిత కలదనికదా? నీ సంకోచము.

కం॥ "కోఱమూలిన దుర్గతుణ
కొఱగాదిది నీకు నాకు గుత్తంబుగ ని
జ్జఱభి వధించెద నీతో
నఱలేని మనోజ కేళి నలరెద నెలఁతుక"

(అని సీతను సమీపింప రాముఁడొకచేత సీతను తన వెనుకకుఁ జేర్చి మఱియొక హస్తము దాని కడ్డంబుగ బెట్టి)

రామ—సుందరీమణి! నా మాట లాలింపుము. ఎవరడ్డు లేకుండఁ బ్రియునితో విహరింపఁగోరు నీవు నన్నుఁగూడి సవతి పోరు నోర్వఁగలవా?

కం॥ బంగారువంటి మేనును
సింగారము లొల్కు మోము సిగముడితోఁ దా
జెంగావి వలువవాడదొ
పొంగారఁగ గూడియుండు బామిన్నాయటకున్!!

ఈ సారి వెళ్ళిన లక్ష్మణుఁడు నిన్ను దప్పక చేపట్టును. పొమ్ము.

శూర్ప—(యోచించి) రామునకు యిల్లాలన నెనలేనంటఁ దగిలి యున్నది. నేనీ సవతి పోరు నోర్వఁజాల; నీకోరుంచి చూచెద

నా సుమిత్రాపుత్రుఁడే సూర్యాస్తుని బోలిన సౌందర్య వంతుఁడు. నాకుఁదగును. అందున నొంటి పాటున నున్న వాఁడు. నావంటి జవ్వని చెంతఁజేరి రతికేళికిఁ బ్రార్థింప వలదని నిరాకరించునా? అతని పాలికే వెళ్ళెదను.

(ముందుభాగమున లక్ష్మణుఁడుండ శూర్పణఖ ప్రవేశము.)

శూర్ప— గీ॥ యౌవనంబున దనరుచు నన్ని దిశలఁ
గాంతి వెదజల్లు నీ సోయగంబు గాంచి
తమకము మాపఁగ లేక నీ దరిని జేర
వలఁపు లిగురొత్త లక్ష్మణా! కలయవేల?"

లక్ష్మ—(తనలో) మరల నిది యెక్కడి గ్రహచారము?

శూర్ప—ఇచ్చేరుపనే నా యన్న లున్నారు. దేవ కిన్నర కింపురు షాదుల నెల్ల జయించి మితిలేని పరాక్రమంబునఁ జెలఁగిల్లు చున్నవారు. నా మాటవిని నన్ను జేపట్టిన వారు నీసేవకులు గ నుందురు. రాక్షసుల కెల్ల నీ వేలికవై సుఖంబున నుండ వచ్చును. ఈ దండకారణ్యంబునఁబడి కాయగసరేతెకొని తిని కష్టపడనేల? నక్షత్రమండలాంతరంబున వెలిఁగెడు చంద్రుని మాడ్కి నిశాచరుల నడుమ బ్రకాసించెదవు. నా మాటవినుము.

(చెంపఁబట్టఁబోవ)-తొలఁగి

లక్ష్మ—నీ హిత వచనంబు లింకఁజాలును. ఒడయుఁడుండ సేవకు నిరోహించుదురే? సువర్ణాభరణము లుండఁబూటకపు సొమ్ము లను బెట్టుదురే? చూతఫలంబు మాని చేఁదిదొండ నపే క్షింతురే? పంచభక్ష్య పరమాన్నములు మాని యాకలములు భుజింతురే? రాముని మాని నన్నుఁ గామించుటందే? రోహించుము,

గీ॥ జగములను బ్రోచు ధీరుఁడు జాణుఁడతఁడు
దాసుఁడను నేను నీ ప్రక్క దాసి వగుచు
చెలువు రెత్తగ జడునిటుఁ జేరనేల?
నీదు సరసత గాంచి నిన్నేలు బొమ్ము.

8. అనుబంధము.

శూర్ప——సుందరా! ఏల నాయాశ వృధ జేసెదవు? నే దనుజ జాతను. వావి వరుస లంత గణింపను. ఇంకొక నిమిష మాత్రమిట్లె యాలసించిన నీయాన, నాయాన, ఆరామునియాన, నిక్కముగ మనఁగజాల.

లక్ష్మ——తరుణీ! మరల నిన్నెప్పుడు గాంతు నా?యని రాముఁడు నీకై యెదురువేచి యున్నవాఁడు. మీకట్టి వావి వరుసలు లేకున్నను మాకైన నుండవలదా? నా మాట లాలింపుము. తొలుత నా యన్నను గోరి నందున నాకు నీవు వదినె వైతివి. తల్లితో సమానురాలవైన నిన్ను నే గోరుట మహా పాతకము.

కం॥ "నినుఁగని నప్పటఁ గోరెను
దన మది నుడివడఁగ రామ ధరణీశుఁడునిన్
గనుఁగొనఁ గోరెదుఁ దడయం
జన దిరువ్యోడ వదినె వైతి చను మవ్యోడకున్"

శూర్ప——(తనలో కొంచము వేసరికతో) అన్నను జూపి తమ్ముఁడు తమ్మునిఁజూపి యన్న యుఁ బొలుపడక నున్నవారు. (కోపమున) నన్నొక బీద మానవు రాలుగ నెంచి కాటియు బెట్టుచున్నవారు. సీతంజూచి రాముఁడొప్పక నున్నవాఁడు. ఈ సారి నామాట విననపక్షే, లేకున్న సీతంబట్టి చదిమి, యొక ముద్దగ నోఁట వైచికొనియెద. అవల వీరిరువురు వలదన్న చ్చి నాపెఁబడుదురు. పోరాడఁగాక (వి.మ.)

లక్ష్మ—(తనలో) ఈ దానవితో వినోద మెప్పటికైనఁ బాముతో జరలాటములు కావే? రాముఁడేల దీనిఁబార దోలక నున్నవాఁడు? నే నేతగువిధంబున దండించుదమన్న నాయన్న యానతి లేదు. కోపారుణ నేత్రంబులతో మరలి పోయిన దానవి యేమి సేయునోకదా? సమీపమున నుండెదఁగాక. (నిష్క్ర–) (రాముఁడు-సీత ప్రవేశము)

రామ—సీతా! విరహిణికి యుక్తాయుక్త పరిజ్ఞానమన్న సున్న. అందున స్వాభావికముగ పురుషులకన్న స్త్రీలకు కామ మెనిమిది పాళ్లధికమను వచనము. నీ దానవి సార్థక మొనరించుచున్నది. దైత్యులకు మానవులకు పొందు పొసఁగదని తెలుఁగక కామాతురమున నక్కడనుండిక్కడికి యిక్కడనుండక్కడికి నిప్పుఁ ద్రొక్కిన బిడాలంబు చందంబున నెట్లు తిరుగుచున్నదో చూఁడు?

సీత—(చిఱునవ్వున) ప్రాణేశ్వరా! కామించి వచ్చిన యువతిని నిరాకరించుట పాపమని యెఱిఁగియు వలదనుటేల? ఇట్టి సుందరాంగి మీకింకెన్నఁడు లభింపఁగలదు? చేతఁజిక్కిన వనితను బోనాడి వెనుక జింతించిన ఫలమేమి? వనిత తానై వలచివచ్చిన మగవారులు బింకమున నొల్లకుందురు. లేకున్న వెనువెంటఁదగిలి కాళ్ళపై బఁడుదురు. (నవ్వును)-(అట్టి సమయమున శూర్పణఖ ప్రవేశము.)

శూర్ప—ఔరా! దీనిక్రొవ్వు. నన్ను జూచి నవ్వుచున్నది. ఓరీ! రామా! యీ త్రిభువనంబుల నొక్కసారి మ్రింగఁజాలిన నన్నొక చీరికిఁ నైనఁగొనకున్నావు. నే నలిగిన నింద్రాది సురలైన దాళఁజాలుదురే? నా నామోచ్చారణ మాత్రముననే మనువెల్ల గడగడ వణఁకుచుందురు. పసి బిడ్డలు సైతము పాలుఁద్రావ వెఱతురు. ఇఁక నీవంటి మానవు

లెంత? ఈ సీతచేకదా? నాకిట్టి పాటులు కలిగినవి. నాకసిదీఱ దీనిఁబట్టి మ్రింగెదగాక. (అని క్రోధంబున మీఁదకు వచ్చును.)

రామ—లక్ష్మణా!

లక్ష్మ—ఏమియాజ్ఞ?

రామ—ఈ శూర్పణఖతో నింక మేలము చాలు. కామాతురంబున వచ్చినట్టి సుందరాంగి కార్యంబును దీర్పుము. జాగు సేయక వెంటనే తీసికొని పొమ్ము. విరూపిం జేయుము. సీతా! మనము పర్ణశాల లోనికిఁ బోదము రమ్ము. (సీత-రాముఁడు నిష్క్ర.).

లక్ష్మ—పడఁతీ! నీకింత పంతమేల? నీ కోర్కెఁ దీర్చెద రమ్ము. (అని యీడ్చుక బోవును).(లోపల హాహాయని యార్తారవము వినబడును)

(చెవులు-ముక్కుఁగోయఁబడి శూర్పణఖ రాక్షసాకృతితో ప్రవేశము.)

శూర్ప—(దుఃఖరోషావేశమున)-అక్కటా! "చేయూఁడ్చవలచివచ్చినఁ జెవులు ముక్కుపోయె." ననుసామెతను దప్పకుండ నీమనుజాధముఁడు నాకిట్టి పరిభవమొనర్చెను. వీరి దేహలావణ్యము గాంచి కదా? నే వలచితిని? ఖర దూషణాదుల కెఱుఁగఁ జెప్పి వీరి శరీరము లింతింత తునకలుగా జేయించి కదు పారఁది నెదను. ఆఖండలాది దేవతల నెల్ల జయించి లంకారాజ్య మేలుచున్న రావణాసురునకుఁ జెల్లెలినైన నాకిట్టి పాటొదవిన నింక సామాన్యులు వీరి మ్రోలఁబడి బ్రతుకఁ గలరా? ఔరా! నరభోజనులమగు మేము మీకా వెఱచుట? ఈక్షణమునఁ బోయి మావారిఁదోడి తెచ్చెదగాక.



ద్వితీయాంకము-ప్రథమరంగము.



(ఖరుఁడు-దూషణుఁడు-త్రిశిరుఁడు-ఆసీనులై యుండ రోదనముతో శూర్పణఖ ప్రవేశము) 11. అనుబంధము (పల్లవి మాత్రమే.)

ఖరుఁడు- చెల్లెలా! ఏమిది? కాలాంతకునకుఁ గాలుఁడను. మృత్యువునకు మారకుఁడనైన నన్నెఱిఁగి యెఱిఁగి నా భయం బొకించుకైన లేకుండ నెవఁడు నీరూపు విరూపుఁ జేసె?

ఉ॥ "ఎవ్వఁడొ కోలయాంతకుని చేసని మార్కొని కోఱమీసెవాఁ డెవ్వఁడొ కో పురాంతకుని యెక్కుఁడు కన్న అకాలుఁదన్నుఁ దానెవ్వఁడొ కో సమిత్రముగ నిప్పుడె చావఁదలంచె నింతవాఁ డెవ్వఁడొ వాని పేరెఱిఁగి యిప్పుడె చెప్పుము నూత్నమింగెదన్."

శూర్ప—(ఏడ్చుచు.) అన్నా! ఎప్పటి యట్లు నేఁడును నాకోమరు కడకేగ వాని శిరంబు నేలంబడి యుండెను. దుఃఖాక్రాంతనై యచ్చటి మానుల హింసింపఁబోవ వారు నా వెఱచి, పంచవటియందుండు రాకొమరుఁడొకఁడు నాసుతుని దునిమెనని వచించిరి. అంత నే నక్కడికింజని, నలకూరాంగజులఁబోలు సుందరాకారులంగని మదన ప్రేరితనే నెన్నివిధంబుల వేడినను నాకోరికఁదీర్పక కామించివచ్చినందుకు, పారితోషకంబిదె చేకొనుమని పరిహసించి నన్నిటు విరూపిం జేసిరి. నీ వీక్షణంబునఁబోయి వారలను వంబునఁ జరిమార్చి రక్తమాంసము నాకడఁబెట్టినఁగాని దుఃఖమాపఁజాలను; భరింపఁజాలను.

ఖరుఁడు--(వికటముగ నవ్వి). సోదరీ! ఆపిటికి మానవులఁజంపనేగవలయునా? అమరగణ సమేతుఁడై వజ్రి వజ్రము --

బూని చౌదంతినెక్కి వచ్చినను నాతో పోరంజాలరు. కాన యీ వెడఁగు నరులు నాచే జావక బ్రతుకువారె? మన సేనాధిపతి యాతఁ డగుట నీ కోరిక దీర్పఁగలఁడు.

శూర్ప—వారు సామాన్య మనుజులు కారు. నీవంటి రక్కసుల నెందఱినైన నొక్క త్రుటికాలమున జయించఁగల వారలకు నీ సైన్యమెంత? నీ సేనాధిపతియెంత? నీవే వెళ్ళినఁగాని కార్యము చక్కఁబడదు. రక్కసుల నుక్కడంచుటకే వచ్చియున్న రామలక్ష్మణుల తోడనా నీసైన్యము యుద్ధ మొనర్చుట? జయించుట? ఇది కల్ల.

దూష—అబలవైన నిన్నుఁబట్టి పరిభవించి నంతనె మేటివగుదువా? ఇదే వచ్చి వారిని ఖండించి నీ ముందట బెట్టెదను లెమ్ము. నా శరీరంబునఁ బ్రాణంబు లుండునంతకు నీ కప కారం బొనరించిన వాఁడెవ్వడైన నేమి బ్రతికి పోఁగలఁడా? నీవు మాకు మార్గముఁజూపుచు ముందు నడువుము. త్రిశిరా! మన సైన్యమెల్ల నిపుడే యుద్ధమునకు నాయత్తపఱచి నా వెంటఁదోడ్కొని రమ్ము. (త్రిశి-చిత్తము-నిష్క్ర)

(పర్ణశాలవద్ద-సీత-రాముఁడు-లక్ష్మణుఁడు)-లోపల కలకలధ్వని.

రామ—తమ్ముఁడా! రాక్షసుల కలకలంబు వినఁబడుచున్నది. ఇపుడేగిన దానవి తనవారలఁబురికొల్పి మనపై బంపియుండ నోపు. నా దక్షిణభుజము, నేత్ర మదురుచున్నది. ఇపుడు రణమవశ్యంబుగనగును, జయము గలుగును. ఆ క్రూర పిశాచపు గాత్రంబులఁ గనుఁగొన జనకనందన భీతిల్లును గాన నీ వెంటఁ దోడ్కొని విజనస్థలంబునకుఁ దోడ్కొని పొమ్ము.

లక్ష్మ—అన్నా! శౌర్యంబునిరాలు మీయరరి బలంబులందిక్కాడ నేనొక బీఱువుభంగి నిందేఁ జనఁజాల. మీ రిం దుండుడు. రాక్షసులనెల్ల సమయించుటకు నా కాజ్ఞ యొసఁగుడు.

రామ—లక్ష్మణా! బలపరాక్రమమున నాకన్న మిన్నవని నే నెఱుగుదు. సందేహింపక వైదేహిం దోడ్కొని గుహాయందుము. క్షణకాలమున రక్కసులనెల్ల నా శరపరంపరల నుఱుమాడి వచ్చెద. మాఱు మాటాడిన నాయానసుమీ

(సీతా-లక్ష్మణుఁడు నిష్క్ర.)

(రాముఁడు ధనుర్బాణములను బూని నిలిచి యుండ పెడబొబ్బలతో ఖరదూషణాదుల ప్రవేశము.)

దూష—ఓరి నరాధమా! మదాంధమునఁ గన్నుగానక మాసహోదరిని బరిభవించిన ఫలంబిపుడంతయు ననుభవింపుము. క్షణము నా యెదుట నిలిచియుండుము.

రామ— గీ॥ ఔర! బీఱంపు మాట లిట్లాడనేల?।
కదన మందున నిల్చిన క్షణములోన।
నీదు గర్వంబు నణఁచెద నిక్కముగను।
భ్రాంగి పోవంగ నేలరా! పోతరమున॥

ఓరీ! నిశాచరాధమా! ఇట్టి వట్టిబెదరింపులు నాముందు పెట్టుము. నీయట్టి వారింబట్టి మట్టుబెట్టుటకై పుట్టిన జగజ్జట్టియ యెఱుఁగుము.

దూష—భళిర! రామా! నీచేత లెక్కలైనఁగానిమ్ము. నీ మాటలు మెచ్చవచ్చు. పాకారింబట్టి పలుబాములఁబెట్టి దిక్పాలకులఁ గంటఁద్రొక్కిన దైత్యులనా బెదరింపఁజూచెదవు? నీ బాణవిద్యాకౌశలము? చూతమురమ్ము.

9. అనుబంధము.

(రాముఁడు-దూషణుఁడు యుద్ధము జేయ-రామబాణముచే దూషణుఁడు-కూలును.)

ఖరుఁడు— గీ॥ బాలుఁడగు దూషణుని జంపఁ బ్రబలమైన
పోటుమానసి వైతివో యోటలేక
నెందు జొచ్చిన విడువక వెంటనంటి
భ్రాతృ ఋణమును దీర్చెద రణమునందు.

రామ—(నవ్వుచు) దానవా! కాఱులేల బ్రేలెదవు? మున్ను నాచే బడిన తాటకి సుబాహు మొదలగు రక్కసులకన్న శూరుఁడవా? వారలను గూల్చిన శరంబే నీపై నుఱుక దీవవడు చున్నది. చూడుము. (బాణమును జూపును.)

ఖరుఁడు—వారిని జంపినటుల గాదు. నాతో బోరుట ప్రళయాగ్ని యందుఱుకఁ జూచుటఁగాదే? ఏమో మహాశూరుఁడవని మిట్టిపడెదవు. (కత్తిఁజూపి)-ఈ నాఖడ్గంబుచే నొక్క వేటునఁ గూల్చి మా దనుజవంశమునకు వన్నె దెచ్చెద.

రామ—మాటలచే బనియేమి? నా బాణమే నీకుఁదగిన ప్రత్యుత్తర మివ్వఁగలదు-తమ్ముఁ.

10. అనుబంధము.

(యుద్ధమును జేయ ఖరుఁడు కూలును.) తెరపడును.

ద్వితీయాంకము.—ద్వితీయరంగము.

రావణుని దర్బారు-రావణుఁడు-ప్రహస్తుఁడు - అతికాయుఁడు మహాకాయుఁడు. ఇంద్రజిత్తు-విభీషణుఁడు మొదలగువారు.)

(అచ్చరుల ప్రవేశము.)

అచ్చ—దైత్యజలధి పూర్ణచంద్రా! వందనములు.

ప్రహ—గణికాంగనలారా! మీ యాట పాటల నిపుణత్వముఁగాంచి రాక్షసేంద్రుఁడు పారితోషిక మొసఁగునుగాన నేడు మీ చాతుర్య మంతయు విని యోగించి బహుమానమ్ము గొనుఁడు.

(అప్సరసలు-చిత్రవిచిత్రముగ నాట్యము సలుపుదురు. అంతలు సెబాసని మెచ్చుకొందురు.)

రావణ——(ఊర్వసిని జూచి) సుందరీమణీ! భరతశాస్త్ర సమ్మతముగ నుండు నీ నాట్యము నాకతి హర్షము గొలుపుచున్నది. ఈ హారముం గైకొనుము. (హారము గైకొని నమస్కరించును. అప్సరసలు నిష్క్ర)

## 11. అనుబంధము.

(శూర్పణఖ రోదనముతో ప్రవేశము.)

అచ్చెరువున నక్కడివారందఱు నవలోకింతురు.

ప్రహ——అమ్మా! శోకింపకుము. నిన్నెవరిటు విరూపింగావించినది?

రావణ——సహోదరీ! ఎవరు నిన్నీవికృతాకారము నొనర్చినది?

శూర్ప——(శోకమున)-అన్నా! బంధు మిత్రామాత్యులతో వినోదంబునం గాలంబుం గడుపుచున్న నీకంతియె చాలు. కడమ వారెటు పోయిననేమి?

## 12. అనుబంధము.

రావణ——(కోపమున) ఎవడిటు నీ ముక్కుంజెవులను గోసి నీ సౌందర్యమును పాడుచేసినది? ముందు దెలుపుము. వాఁడెట్టివాఁడైననేమి యిపుడె ఖండించివైచెద?

శూర్ప——అన్నా! నీ శౌర్యంబునకు నీ బలదర్పంబునకు వెఱువ దేవేంద్రుఁడా? పాఱిపోవుటకుఁ గుబేరుఁడా? నీ యాజ్ఞానుసారం బుండుటకు యక్ష కిన్నర కింపురుష నాగ విద్యాధరాదులా? అటు తలఁపకు——

(రావణుడు-కటము లదరిం(బండ్లుగీటి)

గీ॥ కమల నాభుండొ భారతీ కాంత విభుఁడొ
పార్వతీశుండొ యెవడైనఁ బట్టి కట్టి
తెచ్చి నీముందు వైచెదఁ దెలుపుమిపుడె
ఏనుగలుగంగ నీవేల యింతవగవ? ॥

శూర్ప—నీవు పేర్కొను వారిలో నెవరునుగారు.

గీ॥ తనర దశరథ భూపాల తనయుఁడతఁడు
తమ్ముఁడేవేళ బాయకఁ దన్నుఁగొలువ
పంచవటి యందు నివసించుఁ బత్నిఁ గూడి
రాముఁడను నాఖ్యచే నొప్పు రాక్షసేంద్ర!

రావణ—ఆ! తెలిసె-తెలిసె. శ్రీమూర్తులే నాతోడి డాఁగియున్న వారట. ఇఁక నరభోజనులమైన దైత్యుల ముందరనా నీవా మనుజుల నంతగ బ్రస్తుతించెదవు?.

శూర్ప—పాదాంగుష్ఠము నేలమోపి, యెడమచేతి వేలెండ్లు గోకర్ణమునఁ దపంబు సలిపి, శిరంబులు ఖండించి, యగ్నిహోత్రున కర్పించుట, దనుజుల మెప్పుకై కాని, పగతులను బరిమార్చుటకుఁ గాదు. బ్రహ్మను మెప్పించి నీవు పొందిన వరముల ఫలమేమి? ఖర దూషణాదుల సంహరించి, దండకారణ్య వాసులగు మునుల కానందము గలుగఁజేసి, నా కింత యవమాన మొనర్చినను దశగ్రీవుని భంగ యూరకుండుటఁ జూచి, నిలింపులెల్ల నవ్వుకొనుచున్నారు. నాకు సిగ్గగుచున్నది.

రావణ—సహోదరీ! తుచ్ఛ మానవులనా నీ వింతగ జెప్పునది? వానిచే ఖరదూషణాదులెల్ల మడియుట చిత్రముగ నున్నది. మోసగించి యుండనోపు. అయినను వాఁడెట్టి వాఁడో యెంత బలవంతుఁడో? చూతము శక్యాశక్యముల గణింపుము.

శూర్ప—మిన్ను మన్నేకంబు జేయను మరల భేదిల్ల జేయను, నక్షత్రములెల్ల రాల్పను మరలఁ గూర్పను, సప్త సముద్రంబు లింకింపను మరల నిండింపను, పదునాల్గు లోకంబులు సృజింపను, నిలుపను, లయింపఁ జేయను, సమర్థుఁడు. శూరుఁడు. ధీరుఁడు. వేయేల? అతనింబోలు వీర్యుండీ త్రిభువనములలో లేడని చెప్పవచ్చును. తమ్ముఁ డన్ననో? యాతని కుడిభుజమై యున్నవాఁడు.

అతి—స్త్రీలు సహజభీతచిత్తులను మాట సార్థక మొనరించుచున్నదానవు. ముదుసలులగు ఖరదూషణులఁ జంపినంత నె శూరుఁడు ధీరుడని యేమేమొ పొగడెదవు. (రావణుని జూచి) జనకా! ఆజ్ఞయైన నిపుడే వారి శిరములను ఖండించి మీ ముందు బడవైచెద.

మహాకా—నరు లెంత? వారి బల పరాక్రమం బెంత? నల్లచీమలట్లర కాలనలఁచి వైచెద. తండ్రీ! నా పరాక్రమంబైనఁ జూడుము.

శూర్ప—బాలకులారా! సామాన్యజనులని తలఁచి యేల గర్వించెదరు? మీవంటి వారు లక్షలకొలఁదియైన నొక్క బాణముచే సంహరింపఁ గలరు.

ఇంద్ర—(ఇంచుక కోపముతో) మాటి మాటికి వారల నగ్గలించి మమ్ములం దూలనాడుచుండ నా దేహమంతయుఁ గోపాగ్నిచే దహింపఁబడుచున్నది. తండ్రీ యాజ్ఞయైనచో నిమేషమాత్రమున వారిని నాగాస్త్రముచే బంధించి వాయవ్యాస్త్రముచే నిచ్చటఁ బడునట్లు చేసెదను. ఇంత యోచింపగ నేల?

విభీష—(రావణుని గాంచి) ఎదరిబలమును మనబలంబును యోచించి కార్య మొనర్పవలయు. లేకున్న ముప్పువాటిల్లు. మహాపరాక్రమవంతులగు పదునాల్గువేల దనుజుల నొక్కండే

సంహరింప నెంతటి బలశౌర్యోపేతుఁడని తలఁపవలయు? సామాన్యు లిట్లొనర్పఁ జాలుదురె? కేవలాది విష్ణుఁడైన రామునితోఁ బగఁగొనుట శ్రేయస్కరము గాదు.

## 13. అనుబంధము.

శూర్ప—అన్నా! విభీషణుఁడు వచించినట్లు యుద్ధమున జయింప నసాధ్యము. వంచనోపాయంబున వారలనువధించి త్రిలోక సుందరి రామునిభార్య సీతనుదెచ్చిన నిష్టభోగంబు లనుభ వింప వచ్చును.

ఉ॥ చూచితి మర్త్యకామినుల జూచితి వేలుపు నచ్చెకంటులన్
జూచితి కిన్నరాంగనల జూచితి పన్నగ యక్షకాంతలన్
జూచితి పార్వతిన్ సిరిని జూచితి పద్మజు రాణినిన్ సతిన్
జూచితి సీతసాటి సతి చొప్పడ దెందుఁ దలంచి చూచినన్॥

సీ॥ సుందరి నెమ్మోము షోడశకళలచే
మిట్టాడు చంద్రుని మించియుండు
గజయాన చిఱునవ్వు గాంచిన నీపొద్దు
వెన్నెల భాతిని వెలయుచుండు
ముదిత శిరోజముల్ మెఱుపును జూడంగ
మెఱిసిన గణముల సరణి బోలు
దాడిమీ బీజముల్ తరుణి దంతంబులు
పల్లవంబుల బోలు పాణియుగము॥

గీ॥ చెక్కు లద్దంబు లనవచ్చు చెలియ స్వరము
కోకిలను మించు వయ్యారి కోమలాంగి
కంబువును మించి యున్నది కలికి గళము
వనిత సౌందర్య మెన్నఁగ వశమె నాకు॥

ఆహా! ఆ సుందరాంగి సౌందర్యమును బొగడ శేషాహికైనఁ దరమె? ఆమోహనాంగి మోముఁగాంచ మగువలకైన మరులు గలుగఁజేయు. ఆయన్నులమిన్న చిన్నె లెన్నియని వర్ణింతు?

సీ॥ కమలాకరము జేరి కలకంఠములజీరి
నెమ్మిని నడకలు నేర్పుచుండు
క్రొమ్మావిళుల జేరి కోయిలలన జీరి
యింపుతో గీతంబు నేర్పుచుండు
చిగురు జొంపము జేరి చిలుకసంతతి జీరి
చెలువొప్పు పద్యముల్ చెప్పుచుండు
వనవాటముల జేరి హరిణంబులను జీరి
చూపు విభ్రమములఁ జూపుచుండు॥

గీ॥ చూడ జూడఁగ జోద్యమా సోయగంబు
ఆవిలాసమా సొంపు నావాలు చూపు
ఆ యొయారమా కులుకు లామందహాస
మెంత వెదకిన లేదు రేయింతులందు॥.

అన్నా! నిక్కముగ వచించెద నాకర్ణింపుము. నీవిదివఱకుఁ దెచ్చిన సుందరులెందఱైన నా సీత కాలిగోరునైనఁ బోలఁజాలరు. సీకాయువతి యుండిన స్వర్గభోగంబైన తృణప్రాయంబుగ నెంచి యామోహనాంగినిఁ గూడి రతిక్రీడలచే మైమఱచియుండుట నిక్కము. ఇంతేల.

కం॥ ‹‹ప్రమదాజనులారు లేటికి
నమరాంతకలంక యేటికా రామార
త్నము సిద్ధించిన వారికి
నమరేంద్రపదంబు గోరు నది యేమిటికి

రావణ—సహోదరీ! నే నెవ్విధంబునైన సీతను సాధించి తెచ్చె
నీ మదిఁగల చింతను వీడి నిజనివాసంబున కరుగుము,

(యోచించి) ప్రహస్తా! నేను మారీచుని పాలికిఁ జనవలయును. ఉత్తమాశ్వములఁ బూన్చిన రథంబుఁ గొనివచ్చునట్లు సారథితోఁ దెలుపుము. ఇఁక గొలువు చాలింతము. (నిష్క్ర.)

ద్వితీయాంకము-తృతీయరంగము.

(మారీచుని యాశ్రమము-మారీచుఁడు తపోనిష్ఠ చేయుచుండును.)

రావణ—(ప్రవేశము) మారీచా! ఇవ్వనంబున సుఖంబుననున్నవాఁడవే?

మారీ—(సంభ్రమమున) మిత్రవాత్సల్యంబున నన్ను మీరరయుచుండ నా సుఖమున కేమికొఱఁత? అష్టైశ్వర్యంబులచే నొప్పి సంతోషమున రాజ్యమేలుచున్నావుకదా? ఆయా సంబంధ నిరతదూరమగు నా యాశ్రమమునకు మీరాక కేమి కారణంబో తెలుపఁ గోరెద?

గీ॥ వినుము నామాట మారీచ! వివరముగను
రాముఁడనువాఁడు దండకారణ్యమందు
దైత్యచయమును జండాడి ధైర్యమొసఁగ
నున్నవాఁడట నేనింక నోర్వఁగలనె?

ధాత్రీంచరా! తండ్రి పురంబు వెడలఁద్రోయ రాముఁడను వరుఁడు, తమ్ముని దోడ్కొని, సతి వెంటరాను, దపసివేషంబున పంచవటియందుండఁ జూడంజనిన మన శూర్పణఖ ముక్కుఁ జెవులను గోసెను. మఱియు ఖరదూషణాది మిత్రులఁ జంపి లోక కంటకుండనగు నన్ను లక్ష్యపెట్టక మహాపరాధియై యున్నవాఁడు. అతని భార్య సీత మహాసౌందర్యవతి. అట్టి భూపట్టిం దెచ్చి నా పగఁ దీర్చుకొనుటకు నీసహాయం బపేక్షించి వచ్చినాఁడ.

మారీచ—(భయముతో) రావణా! రాముఁడు సామాన్య మనుజుఁడని తలంపకుము. నేను విశ్వామిత్రుని యజ్ఞము విఘ్నము సేయఁబూని యనేక రాక్షస వీరులతో సుబాహు సమేతంబుగ జనిన రాము బాణాగ్నికి మిడుతల చందంబున సైన్యమెల్ల మ్రగ్గెను. సుబాహుఁడు గూలిపోయెను. తుదకు వేయిగజంబుల బలంబుగల నన్నొక బాణమున నిటు పడవైచెను. వాఁడే నేను జముని మందిరంబునకు నేగువాఁడ. నా పూర్వపుణ్య ఫలంబున నింత వఱకు జీవించి యున్నవాఁడ. షోడశవత్సరముల నాఁడే యింత బలశౌర్యోపేతుఁడై యుండ నిందు జవ్వనమున నిప్పుడెంత బలాఢ్యుడై యుండునో? శస్త్రాస్త్రబల శౌర్యసంపన్నుడైన రామునిఁ జెనకి బ్రతుకఁ గలవా? నామాట వినుము. దూరమాలోచింపుము. బలవద్విరోధము మానుము. కులనాశ కరంబగు నట్టి యుద్యమము విడువుము.

రావణ—(నవ్వి) మారీచా! భయపడకుము. సంగర మొనర్చుటకై నిన్ను బంపను. నీవు మాయలం దతిసమర్థుఁడవని యొక మాయోపాయంబుచే రామ లక్ష్మణులను వంచించి సీత దెచ్చుటకు దలంచినాఁడ. ఒకవేళ సమర మొనర్పవలసి నే నిలిచెదను. బ్రహ్మచే మితిలేని వరములను జేకొ త్రిలోకములను జయించిన నాకీ నరులన నెంతవారు?

మారీ—పంక్తికంఠా! ఇట్టి యోచన నీకే తోచెనా? లేక నెవ్వఁడై జెప్పెనా? సర్వ భోగంబు లనుభవించుచు సుఖంబున నుండక మృత్యువు నేల చెనకెదవు? సీత సామాన్య యువ యని దలఁపకుము. వీరపతివ్రత, సుగుణోపేత, లోకమాత భూజాత సీత. కామాతురుఁడవై తెచ్చి సుత సోదర బంధు మిత్రులతోడ వినాశ మొందనేల? నీకీహితము బోధిం నట్టి యనుకూల శత్రుఁడెవ్వఁడు. తారతమ్యమరయక ఘు

ణఖ లోకాభిరాముఁడగు రాముని గోరఁదగునే? తనకై
తాను పరిభవముఁదెచ్చుకొని క్రోధమున ఖరదూషణాదు
లనుబంప వారు యుద్ధమున సమసిరి. వీరికై నీవిట్లు శ్రీరా
మునితో బగసాధింపఁదలఁచి చెడకుము. ముమ్మాటికిఁజెడ
కుము. ఈ బుద్ధి మాని లంకఁజేరుము. సుఖంబుననుండుము.

## 14. అనుబంధము.

రావణ—(కోపమున) ఛీ! మారీచా! నీచా! కుత్సితుండవై ప్రాణ భీతిచే నాకు నీతులు బోధింపఁబొచ్చితివా? రాజని నన్నుఁ గోరంతైన సరకుసేయక నాకు మాఱు పలుకుచున్నావు. ఈ క్షణమున నీ కుత్తుకఁగత్తిరించెదను జూడుము. (కత్తి దూసిపైకెత్తును.)

మారీచ—(యోచించి) రాజేంద్రా! నీహితముఁగోరి నేజెప్పిన నీకింత కోపంబేల? నీ యిష్టప్రకారంబే వర్తించువాఁడ.

రావణ—(సంతసమున) మిత్రమా! పసిఁడి లేడి యాకృతిఁదాల్చి పర్ణశాల సమీపంబున మెలఁగుచుండుము. సీత నినుగాంచి పట్టి తెచ్చుటకై రామ లక్ష్మణులను బంప వారింగడు దూరము గొనిపొమ్ము. (రావణ-నిష్క్ర-)

మారీ—ఔరా! కాలమహిమ "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లు మృత్యువు సమీపించుచున్నప్పుడు బుద్ధివిపరీతముగ దోచుచుండును. రోగికియశనము పథ్యము గానట్లు నా హిత వచనంబులు కామాతురుండగు రావణున కెక్కవయ్యె. నా కెట్లయినఁజావు దప్పదు. ఈ నీచునిచేఁజచ్చి నరక మొందుటకన్న శ్రీరాముని చేఁబడి పుణ్యలోకంబు వడయుట మేలు. ఇదె వెళ్ళెదగాక. (నిష్క్ర-)

ద్వితీయాంకము.-చతుర్థరంగము.

(పంచవటిపర్ణశాల సమీపమున సీత కుసుమంబులం

గోయుచు లేడినిగాంచి.)

సీత----(సంబరమున) ఆ హా! ఈమృగ మెంతవింతగనున్నది. దేహ మెల్ల చిత్ర విచిత్రపు వన్నెలచే రాజిల్లుచున్నది.

గీ॥ దేహ మెల్లను దీప్తిచేఁ దేజరిల్లు
కొమ్ము లొప్పెడు మాణిక్య కోవ్రలనఁగ
నీల శిలాయతంబైన నేత్ర యుగము
దీనిఁబోలెడు హరిణ మెందేని కలదె?

ఇట్టి మృగంబును బట్టి మన పర్ణశాలయందుంచుకొంటో వేడుక పొడముచున్నది. మచ్చికగల జంతువువలె మనుజుల భయ మొకించుకైన లేక నా సమీపంబున మెలఁగుచున్నది. పట్టెదఁగాక. (పట్టఁబోవ చెంగున దాటి తప్పించుకొనును.) ఏమిటి? ఊరకున్న సమీపించును. పట్టఁబోవ బాఱిపోవును. కాని, ఇట్లునిలిచి యీసారి సమీపించినపుడు యేమఱించి పట్టెద. (హరిణము సమీపించ సీత పట్టఁబోవ చేతఁజిక్కి కొంచములో తప్పించుకొనును. సంతోష మున) ఆహా! చేతఁ జిక్కి కొంచములో జారిపోయెనే? లేఁబచ్చికఁ జూపి యీసారి నేను దప్పకపట్టెదను. (పచ్చికఁ జూప లేడిసమీపించ బట్టఁబోవ లేఁబచ్చిక నందుకొని పాఱిపోవును.) (చింతించి) ఇది మచ్చికగల మృగంబుగ దోచుచున్నది కాని పట్టఁబోవ జిక్కకున్నది. ఏమిసేయుదు. దీనిం గాంచినది మొదలుకొని యాశ్రమమునంగట్టు కోరిక మిక్కుటముగ నున్నది. (యోచించి) నా ప్రియున కెఱిఁగించి దీనిఁబట్టి తెచ్చుటకై ప్రార్థించెద. ఎట్లైన నాముద్దు చెల్లింపక మానఁడు (రాముని సమీపించి సీత మందహాసమున) నాథా! ఈ చేరువనె పుష్యరాగములట్లు శుద్ధమైన మచ్చలతో మేను ప్రకాసింప నొక వింతలేడి చరించుచున్నది. (రెండడుగులు ముందునడచి.)

## 15. అనుబంధము.

సీత——దీని యందంబుఁగాంచ నామనసానందించుచున్నది. దీనిం బట్టి మనకుటీరంబున నుంచిన నెంత ముచ్చటగనుండును. ఎట్లైనఁ బట్టి తెచ్చి నాకోరిక దీర్పుము.

రామ——ప్రాణేశ్వరి! లేడికై నీవింత వేడవలయునా? అవశ్యము నీ కోరికఁ దీర్చెద. తమ్ముఁడా! ఈ మృగంబెంత రమణీయముగ నున్నదో చూచితివా?

15. అనుబంధము.

భగవంతుని సృష్టిమహిమ నెఱుఁగ నెవరికిఁ దరముకాదు. మన దృష్టిపథంబునకుఁ బడని విచిత్రములైన మృగంబు లింకెన్ని గలవో తెలియ సాధ్యమా? తలిదండ్రుల నెడబాసి పురంబువీడి వెంటఁజనుదెంచి యిడుములఁ బడుచు నధికానురాగంబున గోరిన ప్రియురాలి కోరిక నెఱవేర్చకున్న నేనుండిన ఫలంబేమి? దీని వెంబడించి పట్టి తెచ్చి భూపుత్రికను సంతసింపజేసెద. సీతా! నే వెంటాడి మృగంబెచ్చటకేగినను నీకడకు బట్టి తెచ్చెద. చింతిల్లకుము. లక్ష్మణా! నీవీ జనకనందనను నెడబాయక గాచియుండుము.

లక్ష్మ—— గీ॥ అన్న! నా విన్నపంబిదె విన్నవింతు
సాధు తరమైన మృగబుద్ధి కాదు తలఁప
దనుజ మాయా వికారంబె ధరణి నాథ!
జాడ లరయక వేఁటాడ జనగవలదు.

అగ్రజా! దేవ లోకంబునందుండు జంతువులకైన నిట్టి యందం ండునె? అంతేకాదు. పితామహుని సృష్టియందే కానము. నాకుఁ

జూడ దనుజ మాయా రూపంబేకాని వేఱుగాదు. ఈ హరిణంబున నిక్కమని యెంచి ముగ్ధయైన జానకి కోరిన మాత్రముననే నివారింపక వెంటఁజనుట నా యభిమతంబుకాదు.

రామ—(నవ్వి) గీ॥ బాల జానకి నను జేరి లోల యగుచు
బట్టి తెమ్మని కోరె నా హరిణ మిపుడు
వీరుఁడై దైత్య మాయకు వెఱవనేల?
వింతఁ జూపట్టె నీమాట వినఁగనాకు.

లక్ష్మణా! మృగంబు నిక్కంబైన బట్టితెచ్చెద. లేకున్న నాశరంబుచేఁగూల్చి తపసులకెల్ల రాక్షస బాధ దొలఁగఁజేసెద. ఎట్లయిన నీకార్యం బవశ్యాచరణీయంబు. నే వచ్చుదాక వైదేహి నేమఱకఁగాచి యుండుము. నేనతి శీఘ్రంబున మరలివచ్చెద తమ్ముఁడా! నిమిషమైన నీవదిన నేమఱకుండుము. బాణబాణాసన ధరుఁడవై జాగ్రతతో వర్తింపుము.

లక్ష్మ—(దీనవదనుఁడై) అన్నా! మఱిమఱి చెప్పవలయునా? కంటికి ఱెప్పవిధంబునఁ గాచియుండెద. నీవాహరిణము వెంబడవ్వేగిక మనలక శీఘ్రంబున రావేఁడుచున్నాఁడ.

రామ—తామసింప నవసరమేమి? చిక్కినం బట్టితెచ్చెద. లేకున్న హతము గావించి చర్మంబైనఁ గొనివచ్చెద. జాగ్రత సుమా? (నిష్క్ర)

లక్ష్మ—(తనలో) అక్కటా! ఏకీమ మాయో నో కాని సర్వజ్ఞుఁడగు రామునకే బుద్ధిమాంద్య మేలగలిగెనో తెలియకున్నది. (సీతను జూచి) అమ్మా! మన పర్ణశాలకుఁ బోదము రమ్ము. (నిష్క్ర)



## తృతీయాంకము.—ప్రథమరంగము.

(మాయామృగము వెంట రాముని ప్రవేశము.)

### 16. అనుబంధము.

రామ—నే నెన్నియుపాయంబులఁ దీనిఁబట్టఁబోయిన నా చేఁజిక్కక జిక్కులు పెట్టుచున్నది. (యోచించి) ఈ చెట్టుమాటున నిలిచి తృణమునకై వచ్చునపుడు పట్టెద. (రాముఁడట్లే చేయ జింక తప్పించుకొన విస్మితుఁడై) దీని యాకార చేష్టాదులఁగాంచ మాయా మృగంబనియే తప్పక తోచుచున్నది. ఇంత దూరము నన్నుఁద్రిప్పి యాయాస పెట్టిన దీని నూరకఁబోనిత్తునా? దీనినిప్పుడే నాక్రూర నారాచంబుల పాలు గావించెద. (శరమెక్కుపెట్టి మృగంబు వెంటఁజనును.)

## తృతీయాంకము-ద్వితీయరంగము.

పర్ణశాల-సీత-లక్ష్మణుఁడు.

సీత—లక్ష్మణా! మీ యన్నచని చాలా తడవయ్యె. ఆమృగ మెంత దూరమేగెనో? ప్రియుఁడెంతా యాసము బడుచున్నవాఁడో తెలియకున్నది?

లక్ష్మ—తల్లీ! నీయందుండు ప్రీతిచే కురంగమునకు ప్రాణాపాయంబు గాకుండఁ బట్టఁదలచి యుండవలయు. లేకున్న నింత లడవేల కలుగు? మరలివచ్చుచునేయుండును.

(లోపల ధ్వని—హా లక్ష్మణా!)

సీత—(దీనాననయై లక్ష్మణుని గాంచి)

శా॥ "వింటే లక్ష్మణ! రాము నార్తరవమై వీతెంచె నే నొంటిపా
మ్మాటిం దమ్ముండ యేమి ఘూర్ణిల్లెనో కదే హాలక్ష్మణా యంటగా
వింటిం దాలిమిఁబట్టఁజాల నటవీ వీథిం గురంగంబు వే
న్నంటం బోక దలంపఁగీడు సనవే వేగంబు నిన్వేఁడెదన్."

సుమిత్రానందనా! ఆ రాఘవున కేకీడొదవెనో కదా! ఘోరారణ్యంబునఁ దనుజులచే నెట్టి యిక్కట్టునఁ జిక్కెనో కదా! అశుభ సూచకముగ నాకుడి కన్నదరుచున్నది. గుండె నీరై కరఁగుచున్నది. దేహము వశతఁ జెందుచున్నది. నీ వీక్షణంబున నా నాధునిఁగాపాడుము. పొమ్ము. వేగపొమ్ము.

## 17. అనుబంధము.

లక్ష్మ—మత్త॥ తల్లి! యేటికి భీతిజెందగ? ధైర్యమున్నది బూను
యుల్లమందున నెంచ లేవొకొ యుర్వినాథు మహాహ
కల్ల రాక్షసుఁడెవ్వఁడో యిటు కాటుకూఁతలకు
దల్లడిల్లగ నేల? నీవిటు తథ్యమారసి కాంచుమా

అమ్మా! లోకరక్షణ ధీరుఁడైన రాము నెదిరిపోర … కంబున లేరు. ఒకవేళ క్రూర రాక్షసులు పైఁబడిన నార్చిచ్చునంబో… శలభంబుల చందంబున రాముబాణాగ్నికి నశింపక నిలువఁగ ఈ కాననంబున నిన్నొంటి విడిచి చనుట న్యాయము మనల వెఱపింపఁదలచి యెవ్వఁడో దనుజుఁడిటు చీరెను గా… దిగులొందకుము.

సీత—(దుఃఖమున). అకటా! లక్ష్మణా! ఇట్టి కఠినోక్తు లా
నీ మనం బెట్లొప్పెనో కదా? క్రూర దానవులచేఁ
బ్రాణాపాయంబున "హాలక్ష్మణా" యని పిలువ
నెమ్మదిగనుండ నా మనంబుత్తల పడుచున్నది. నిక
దాయలు … చెంతఁ జేరి కీడు కెదురు వేచి
దురను బలుకు నీయందు గానఁబడుచున్నది కదా?

క॥ “సిగులుడి యేను బనిచిన
పగుడం జెప్పెదవు గాని మది నించుకయుం
బెగడవు సవతుల కొడుకులు
పగవారని నీతివిదులు పలుకుట బొంకే?”

లక్ష్మ—అమ్మరో! నీవాడినట్టి మాటలు శూలంపు పోటులట్లు నా హృదయంబునం బాఁకి బాధించుచున్నవి. రామాజ్ఞను మీఱఁజాలకను నిన్నొంటి విడిచిచనిన నేక్షణంబున నేకీడు నిశాచరులచే మూడునో యను భీతిచేతను, నేనున్నవాఁడ.

18. అనుబంధము.

నిక్కముగ నాయన్న కాపద కూడెనేని పైలోకంబులెల్లను పెల్లున గూలవా? నక్షత్రంబులెల్ల జలజల రాలవా? సూర్యచంద్రులు మార్గంబు దప్పిపోరా? జననీ! యూరక తల్లడమొందకుము. ధైర్యంబున నుండుము.

సీత—(గోపావేశంబున)

చం॥ “అనుజుఁడనంచు నున్నొక దురాత్ముఁడు రాజ్యవిభూతి యెల్లఁ జే
కొనియటు సేసె నీవుఁగడు క్రూరత రాముని చావు వేచితే
మనఁగల దింక నిన్నుఁ గుటిలాత్మక నాకని కాచినాఁడవే
నినుఁగయికొందునే? నిలువు నీఱయి కూలుదుగాక దుర్మతీ!”

దురాత్ముఁడగు భరతుఁడు, తమ్ముండని నమ్మినంతనె రాజ్యమపహరించి మమ్మీయడవులఁ బాఱఁదోలె. నీవాప్తునివలెవచ్చి రాముని చావునకై వేచి నాపై కాంక్ష చేసియున్నాఁడవు. ఓరి నీచా! నిక్కముగ నీచేజిక్కను. పావనంబగు గోదావరియందైనఁబడి ప్రాణంబులు వీడెద. అటుకాకున్న అగ్నిహోత్రమున కాహుతిగ నాదేహ మర్పించెదగాని మున్మాటికి నీకేను దక్కను. ఘాతకుఁడా! మిత్రుని వలెవచ్చి శత్రుత్వము సాధింపనెంచితివా? సన్మార్గునివలె చెంత

జేరి దుర్మార్గుఁడవై కన్నుగానక నీవలె నన్న భార్యఁగోరు పాపాత్ము లుందురా? నీముఖమింక నే జూడను. ఛీ! అవలవెళ్లుము. (తలవంచి దుఃఖించును.)

(లక్ష్మణుఁడు మూర్ఛిల్లి లేచి కర్ణములు మూయుచు.)

లక్ష్మ—హరి హరీ! జననీ! నేడెట్టి కఠినోక్తు లుగ్గడించితివి.

సీ॥ జనని నే నారీతి స్వప్నమందైనను
దలపోయ నామాట తథ్యమమ్మ
అమ్మరో! రాముఁడే పరగ దైవంబని
పేద్మ—తో జేరి సేవింతు నమ్మ
తల్లిరో! నీవెనా తల్లి సుమిత్రగా
విడువక మదిని భావింతునమ్మ
మాతరో! రామాజ్ఞ మడిమీరఁ రాదంచు
నిలిచిన తప్పుమన్నించవమ్మ

గీ॥ దశరథునిగనే రాముని దలతునమ్మ
నిన్ను గౌసల్యగను మది నెంతునమ్మ
అమ్మ! నామాట నిజమిది నమ్ము మదిని
పాప మొండొక టెఱుఁగ నీ పాదమాన.

(నమస్కరించును)

తల్లిరో! నేడెట్టిదుర్దినము. అకటా! ఎట్టి కర్ణకఠోరంబగు పలుకులు నుడివితివి. నన్ను "హీలత దాయు" వని నిగ్రహించినపుడే సహస్రాంశుని వేడిమికిఁ దాళఁజాలక వసివాడిపోవు మల్లె ప్రసూనంబు మాడ్కి నా జీవితలత వాడి వత్తై కృశించుచున్నను సహించి, నీమే

గోరి, నే వచించిన వచనంబులను జెప్పరాని, వినరాని, తలఁచరాని అక్కటకటా! స్వప్నావస్థయందైన నెంచరాని, కలుషము నాయం దోపించి, నా కెంతో సహింపరాని బాధగలుగఁజేసితివి. అహో! పావకునియందు నాస్నానహుతి కావించియున్నను, మహాశైలచల

యులఁ ద్రోయించియున్నను, చలచల్లఁగాఁగు తైలంబునఁబడవైచి యున్నను, నిశితఖడ్గంబుచే నా శరీరము తుత్తునియలుగా ఖండించి యున్నను,మత్తేభంబులచే ద్రొక్కించియున్నను,సంతసంబున భరించు చుంటినికాని, నరక భూయిష్ఠంబై, యావజ్జీవ సంతాపవహ్నులై, లోకనిందాకరంబై, దురితంబున కాలవాలంబైన, నిష్ఠుర వాక్యంబులు, నీయట్టి, పతివ్రతాతిలకంబు నోటవెడల, నేవినఁజాల; విని యుటనుండఁ జాల, యుండి భరింపఁజాల, భరించి నేమనఁగఁజాల. అమ్మరో! యే దినమునందైన నేయామమందైన, నే ఘడియయందైన, నేనిమిష మందైన, నామానసంబు నిష్కల్మషముగ మాతృభావంబున నిన్ను బూజించుచుండును. ఇనవంశధాముని, మునిజనస్తోముని, యోగిజన విధేయుని, రాముని యెడల భేదమెంచియుంటినేని, నానాలుక ప్రీలిపడుఁగాక. నాదేహంబు పాండుక్షయాది వ్యాధులకు లోనగుఁ గాక. నేను మహాఘోరవాడి నరకంబునకుఁ బోదునుగాక. ఇందుల కీవనదేవతలేసాక్షి. అష్ట దిక్పాలకులే సాక్షి. మింటమెలఁగుచు మనుజుల పాపపుణ్యకర్మంబులకు సాక్షియై, తేజోమూర్తియైన భానుడేసాక్షి. జననీ! యీమాత్రిపు కాలవిలంబమునకే నా నిష్క ల్మషమానసం బెఱుఁగక నన్నిట్లు దూఱనాడితివి. ఇంకిట నొకక్షణం బైన నిలువనోప. (బాష్పపూరిత నేత్రుఁడై మిన్నుఁదిలకించి)

సీ॥ శ్రీరాముదేవి యీ సీతను గావరే
గరుడ కిన్నర దేవగణములార!
దశరథు కోడలీ తరుణిని గావరె
దయతోడ పంచభూతంబులార!
జనక తనూజ యీ జానకిఁగావరె
మునులార యోపుణ్య మూర్తులార!
కువలయనేత్ర యీ కోమలిఁగావరె
తరులార గుల్మలతాదులార

గీ॥ పన్నగములార! యోవనపక్షులార!
ఇచట నేనుండ దగదింక యెటులనైన
బోవు చున్నాడ నేనిదె పొలతినీడి
వెలది సీతను బ్రోవరె వేల్పులార!

కం॥ వన దేవోత్తము లారా!
విన గూడని పరుసములను వింటిరి కాదే?
చనదిక నుండగ నేనిటు
జనకజ బ్రోవంగ వలయు చయ్యన మీరల్

(లక్ష్మణుఁడు నిష్క్ర.)

(సీత చింతించుచుండ రావణుఁడు సన్యాసివేషమున ప్రవేశము.)

రావణ—(దూరమున నిలిచి) భళిరె! ఈ సుందరాంగి సౌందర్యము.

సీ॥ శారద పూర్ణిమా చంద్రబింబమొ లేక
పడతి ముఖంబో యేర్పరుపరాదు
ఇంద్ర నీలచయంబో లేకున్న కమలాక్షి
కురుల యందంబో యేర్పరుప రాదు
కనక కుంభంబులో కాకున్న చేడియ
గురుకుచ యుగమొ యేర్పరుపరాదు
అనఁటి కంబంబులో కాదేని తొయ్యాలి
వరయూరుద్వయమొ యేర్పరుపరాదు

గీ॥ ఔరా! యీయింతి యందంబు భళిరె! సొంపు
నొందు గానను త్రిభువన నెలత లందు
గాన నీచాన తోఁగూడి కలసి మెలసి
పొంది సుఖియించు వాఁడెపో పుణ్యతముఁడు.

ఈ మత్తకాశినిం గూడి సమరతుల మదనకదనంబు సల్పఁ జాలని వాని జన్మంబు నిరర్థకంబుకాదె? ఆ పురవైరి ముదవై

లడ్డంబైన విడువక మదీయ రాజ్యలక్ష్మికిం దోడుగ నీ సుందరాంగిని నా కర్ధాంగ లక్ష్మిగ గైకొందుఁగాక. ఆహా! ఏమి యీజగన్మోహనాకారము?

## 19. అనుబంధము.

గీ॥ మించు తీగను మించును మెలఁత మిన్న
తేట తేనియ లొలుకును తెలివమోవి
పద్మముల గేలిసలుపు పాణి తలము
రమణి సొంపెల్ల నయనాభి రామమయ్యె.

(రావణుఁడు సీత సమీపమునకు వచ్చి) "హరహరమహాదేవ!"

సీత——(లేచి వినయంబున) యతీశ్వరా! మీరాకచే నా హృదయము పరమానందంబు జెందె. ఈ యర్ఘ్య పాద్యాదులఁగొనుఁడు. (ఆసనముఁ జూపి) ఈ యాసన మలంకరింపుఁడు. (ఫలములు తెచ్చి) ఈ ఫలముల నారగింపుఁడు.

రావణ——(వాని నెవ్వియుఁగొనక యట్లెనిలిచి) తరుణీ! నీ సత్కారంబునకు సంతసించితిని.

కం॥ రతివో భారతివో శ్రీ
సతివో కాకున్న నీవు శచివో తలఁపక
ధృతి నిట్లొంటిగ నుండక
గతమే మియొ? తెలుపు నాకు కంజదళాక్షీ!

సీత——మహాత్మా! మీరు పేర్కొనిన వారలం దెవరితయు నే గాను.

రావణ——అట్లయిన నీ జనకుఁడెవ్వఁడు? అనవరతము నీతో సుఖించు పురుషుఁడెవఁడు? ఒంటరిగ నిందుండఁ గారణంబేమి?

సీత——మునివరా! నా జనకుఁడు మిథిలేశుఁడు. దశరథుని పుత్త్రుఁడు శ్రీరామచంద్రుఁడే నాపతి. తండ్రి పనుపునఁ దమ్ముఁడగు

సౌమిత్రి తోఁగూడ, నావిభుఁ డరణ్యావాస మొనర్చుచున్న
వాఁడు. ఇపుడొక వింత కురంగ మిటురాగ నాకోర్కె
నా నాథుఁడా మృగంబును బట్టి తెచ్చుటకు వెడ
లిపోయెను. ఆపల కొంత సేపటికి "హాలక్ష్మణా" యను
నార్తారవము నా వీనులకు సోక సౌమిత్రిని బంపితిని. మీరిం
కొంచెము విశ్రమించిన, నింతలో వారరుదెంచు మీ కుచి
సత్కారం బొనర్తురు.

రావణ——సుందరీ! నీ తెలిఁగెల్ల నాకెఱుఁగఁజేసి సంతసం బొనర్చి
తివి. ఇఁక నాయుదంత మొకింత వినుము.

చం॥ "కమలభవుండు తాత గుణగణ్యుఁడు విశ్రవసుండు తండ్రి పే
ర్మమయ వినూత్న రత్నమయ మండిత మాత్మపురంబు లంక వి
క్రమము త్రిలోక భీకర ముఖంబు సుభాకరమైన దైత్యరా
జ్యమునకు నేను భర్తఁ బటుశౌర్యుఁడ రావణ నామధేయుఁడన్"

పులస్త్య బ్రహ్మ తాత. విశ్రవసుఁడు తండ్రి. నా పేరు రా
వణుఁడు. నేనేలునది లంకాపురము. ఈ పదునాల్గు లోకంబులందుండు
సుందరీమణులం దెచ్చి యెదురులేక భోగించుచుందును. నీ సౌం
విలాసంబులు విన్నది మొదలు పట్టరాని మోహంబున నన్నపా
దులు మాని కృశించి నీ చెంతఁ జేరినాఁడ. నీచ మానవునిఁగూడి, దం
కాటవింబడి యుండనేల? నా కర్ధాంగివై, లంకా రాజ్యమున శ
క్తివై సకల సౌఖ్యంబు లనుభవింపఁగలవు. రమ్ము.

సీత——(కోపమున) ఓరీ వాచాటుఁడా! బ్రహ్మ కులంబునఁ
బ్రహ్మకు మనుమఁడవై యిట్టి పాపపు మాటలాడఁజను
నిక్కముఁ మహాశివని యెంచి పూజించి నందుకు, క
గానక, కామాతురంబున నిట్లు కాఱులు ప్రేలసగు
దురాత్మా! నీవా సలువ వరంబున గర్వించి నీసరి యెవ్వ
లేరని విఱ్ఱవీగు చున్నవాఁడవు. నా పతిలేని సమయం
వేచి, నన్నిట్లాఁడఁ బ్రతికితివిగాని వారియెడ నుం

నీ శిరం బీవఱకు వ్రక్కలై నేలం బడకయున్నె? రతుక హీనవనై, దీనవదననై చింతించుచున్నట్టి యబలనా సిట్లా డుట? ఓరీనందా! అనాధ యువతుల బాధించ నెంచిన పాపాత్ముడవు. శ్రీరాముని యెవరని తలంచితివిరా?

గీ॥ భార్గవుని గర్వమణచిన బలియుడతడు
శూలి చాపంబు ద్రుంచిన శూరుడతడు
క్రూర దైత్యుల జంపిన ధీరుడతడు
అట్టి వీరుని సతి నను ముట్టదరమె?

నా నాధుడిటు లేనందున నీ బొల్లుకూతలు చెల్లెగాని యున్న ట్లయిన నీశరీరంబున శిరంబపుడే వేఱుపడి యుండునుగదా? బుద్ధి కలిగి నిలువకపొమ్ము. ప్రాణంబులను గాపాడు కొనుము.

## 20. అ ను బం ధ ము.

రావణ——(నవ్వి) రమణీమణీ! ఒక పేదమానవుని గొప్పచేసి పొగడు చుండ నాకు నవ్వు వచ్చుచున్నది. పదివేల రాములనైన నొక్కసారి పట్టి యుక్కడంచుటంతటి బలశాలినని నీ వెఱుం గవుకాంబోలు.

చం॥ „పెఱుకుదు నే ఫణీంద్రు విషభీకర దంష్ట్రలు నేలగ్రుంగజే
సఱతునె నింగిద్రుంగుదునె చండ దిశా గజదండ కాండము
ల్విఱుతునె వారిధుల్ పుకిసిలింతునె మందర మంగుటంబునం
జెఱుచుదునే జగంబు లఱచేతికిదెత్తునె మత్తకాశినీ!"

సీత——(కోపమున) ఓరీనీచా! శస్త్రాస్త్ర విద్యా విశారదుడగు రఘురాముని భార్యంగోర నీకెన్ని తలలుకలవురా! రాము నకు నీకును హస్తిమశకాంతరము.

రావణ——ఎన్ని శిరంబులున్నవో చూడుము? (సన్యాసి వేషము వదలి నిజరూపముంజూప, సీత భీతిచే మూర్ఛిల్లును.) ఇంతీ! నా

నిజాకృతింగాంచితివా? రాము డెందరైన నాసరి రాగల డో యోచింపుము. (పరికించి) ఓ-హో-హో! మూర్ఛిల్లిన. ఇదే కొనిపోవుటకు మంచి సమయము. సీతంబట్టి రథంబుపయింబెట్టి లంకంజేరెదగాక. (అట్లే చేయును.)

తృతీయాంకము--తృతీయరంగము

అరణ్యము-రాముని ప్రవేశము.

**రామ**---నక్కలు కూయుచుండె బక్షులప్రదక్షిణంబుగ దిరుగుటయు మఱికొన్ని దుశ్శకునంబులంగనుంగొన, నా మనం బత్యంత భీతి జెందుచున్నది. పాదములా తడబడుచున్నవి. గుండెదడదడ గొట్టుకొనుచున్నది. ఆరక్కసుని రావంబు విని జానకి నాకై యెంత శోకంబు జెందెనో? ఒక మాయావులైన దనుజులు నాయనుజునింజంపి, సీతకే దుర్గతి గలుగంజేసిరో? వచ్చుచున్న సౌమిత్రి కేయిక్కట్టు వైళమో కదా? ఏమియుం దోచకున్నది. వారలగాంచు నంతకు నా మనం బూఱడిల్లు టెక్కడ? పోయెదగా (పోంబోవ లక్ష్మణుండెదురై నమస్కరించును.)

**రామ**---(నివ్వెఱపడి) తమ్ముండా! నట్టడవిని మావదినెను డించి చెంతకేల వచ్చితివి?

21. అనుబంధము.

**లక్ష్మ**---అన్నా! "హాలక్ష్మణా" యను నార్తారావంబు వినంగనె స సహాయంబుగ నన్నుబొమ్మన్న "తల్లీ! చింతింపకుము; ఘోరారణ్యంబున నిన్నొంటి విడిచి పోవ నపాయ వాటిల్లు; రక్కసుని మాయా విశేషంబే కాని శ్రీరామకే కీడొదవదని" నే నెన్నివిధంబుల బోధించినను. విన నన్న నరాని, వినరాని, చెప్పరాని, మాటలచే దూషించి సల్పంజాలక నీ కడకు వచ్చితిని. క్షమింపుము.

రామ—స్త్రీలు సహజ భీరువులుకదా? నిష్ఠురోక్తులాడి పొమ్మన్న మాత్రమున నే, నీవించుకేనియు యోచించక, క్రూర రాక్షసోపేతంబైన నత్తావున నొంటిగ విడిచి వత్తురే? అప్రియంబులు పలికిన సైరించక, యబలయటంచు చింతించక, తుదకు నా యాజ్ఞయైనఁదలంచక, నీవొనర్చినట్టి యకార్యంబునకు, సీత, యిప్పటి కేమృగంబువాత బడియెనో? యే రాక్షసుని గాంచి భీతిల్లి ప్రాణంబులు వీడెనో? యేదానవుఁడు తటి వేచి, యిదే సమయంబని చెఱఁబట్టి గొంపోయెనో? యింక యేమయినదో కదా?

గీ॥ దుశ్శకునములు పొడసూపె దోఁడదోఁడ
శంక పొడమెను తమ్ముఁడ శక్తి క్రుంగ
సీత నే జూతునో? లేదా ప్రీతి తోఁడ
గానరాదయ్యొ నా పూర్వకర్మఫలము.

అనుజా! ఆలసించిన కొలఁది నా డెందంబు కొందల మందుచున్నది. శీఘ్రంబె యాశ్రమంబున కరుగుదము రమ్ము. (నిష్క్ర.)

## తృతీయాంకము-చతుర్ధరంగము.

(అటవి-గగనమార్గమున రథము-రావణుఁడు-సీత)

### 22. అనుబంధము.

సీత-చం॥ ననుఁజెఱఁగొంచు రావణుఁడు నానుక రక్కసుఁ డేగుచున్నవాఁ
డినకుల రాజరత్నమ శుభేక్షణ లక్ష్మణ తేరు వేగమై
చనియెడు రాఁగదే యెఱుక సాలక తమ్ముఁడ నిన్ను నప్పుడే
ననుచిత భంగి నిష్ఠురము లాడిన పాప ఫలంబు గాంచితిన్.”

అన్నా-లక్ష్మణా! అజ్ఞానంబున నే బలికినట్టి పలుకులకు గోపించుకొనక విపదాబ్ధియందు మునింగిన నన్ను రక్షింపుము............అయ్యో! కైకా నీవు కోరినట్టి కోరికలెల్ల నేడు ఫలించెగా? ఇఁక నీసుతుఁడే

యాచంద్రార్కముగ భూపతిరై యుండనిమ్ము. అకటా! కౌసల్యా! నీకిక నోడలి లేదను కొనుము. జనకా! నీకీపుత్రికయే పుట్ట లేదను కొనుము. సంతాపంబున వేగు నాజననిత్రిని యూఱడింపుము. ఓసహోదరీ మణులార! నే పురంబు బాయునపుడు దుఃఖభరంబున నా వెంట వచ్చెదమని, నిక్కచ్చిచేయ, నివారించి పదునాల్గు వత్సరములు, పదునాల్గు దినములట్లు గడపి, మిమ్ముల జేరుదునని, యొప్పించితిని; దైవము తప్పించెగదా? బాల శ్రుతకీర్తిని మీరెట్లర సెదరో? మీరింకెవరిని "అక్కా" యని పిలిచెదరు? ఎవరు మిమ్మాదార్చు వారు? ఓ మేఘములారా! మీరైనవచ్చి శ్రీరాముని సన్నిధికి నన్నుం దోడ్కొనిపొండు. ఓపంచభూతములారా! యీదుష్టుని దండించి కోదండరామునితో కూర్పుడు. ఓ మృగ సమూహములారా! మీరా రెల్ల నీరక్కసునిపైబడి చీల్చి నన్నా కోసలాధిపతితో జేర్పుడు.

సీ॥ "పావనాకార గోదావరీ దేవి నీ
వెఱిగింపవమ్మ రాజేంద్రుతోడ
నోమాల్యవంత పుణ్యోన్నత గిరినాథ
చెప్పంగదే రాజసింహుతోడ
నోజనస్థాన మహీంజములార యీ
విధమెఱిగింపరే విభునితోడ
నోదండకాటవి నున్న తాపసులార
నాపాటు చెప్పుడీ నాథుతోడ

గీ॥ నేను శ్రీరాము భార్య మీరెవ్వరైన
నడ్డపడి తాఁకి విడిపింప రయ్య కావ
రయ్య సురలార మునులార యక్షులార
యఖిల దిక్పతులార పుణ్యాత్ములార!"

ఈ పాపి రక్కసుండిటు నను గొనిపోవుచున్నవాఁడు శీఘ్రంబున వీనిఁబమార్చి నా నాథునికడ నన్నుఁజేర్పఁగల పుణ్యాత్ములెవ్వరైన లేరుగా? అయ్యో! యెంత చెడుకాలమాసన్నమాయెను

సీ॥ సురలార! నరులార! సురవైరి నెదరించి
కరుణతో జెఱమాన్పి కావరయ్య
ఘనులార! హితులార! గంధర్వవరులార!
కరుణతో జెఱమాన్పి కావరయ్య
నాగులార! కవులార! హరిణసంతతులార!
కరుణతో జెఱమాన్పి కావరయ్య
తాపస వరులార! ధరపుణ్య జనులార!
కరుణతో జెఱమాన్పి కావరయ్య

గీ॥ అయ్యో! నా మొఱ వినరయ్య యన్నలార!
మౌని వరులార! యతులార! మాన్యులార!
తడవు జేసిన గార్యంబు తప్పునకట!
వేగ రక్షింప రారె నా వెతలు దీఱ!

అమ్మా! భూదేవీ! నీపుత్రిక నిటు దుష్ట రాక్షసుఁడు కొని పోవుచుండ నూరకుండుట మేరయౌనా? అక్కటా! ఒక్కరయిన నామొఱాలించకున్నారు. నాపూర్వకర్మఫలంబు బలవత్తరంబై యుండ వీరలేమి సేయుదురు?

సీ॥ కటకట హరిణంబు గాంచిన వెంటనె
కాంక్షేల నాకంత కలిగెనో క్కా?
కలిగెపో విభుడేల కనక మేడినిపట్టఁ
బోవ్మని నంతనె పోయెనొక్కొ?
పోయెపో దైత్యుఁడు పొలయుచు వేలకో
హాలక్ష్మణా'యని యఱచెనొక్కొ?
అఱచిన నేనేల నుఱిదిని దూఱితి?
చయ్యన నతడేల చనియెనొక్కొ?

గీ॥ అట్టి దుర్బుద్ధి నాకేల పుట్టెనో కొ-
ఏమి నా పూర్వకర్మంబొ యెఱుఁగ నకట
వీని చెఱమాన్పి రక్షింప వేగమిపుడె
రమ్ము శ్రీరామ రఘురామ రామచంద్ర.!

23. అనుబంధము.

(లోపల ధ్వని)-ఓహోహో! వెఱవకుము. వెఱవకుము. ఇదె వచ్చుచున్నవాఁడ.

జటా——(తనలో) ఈ దుష్టరాక్షసుఁడు శ్రీరాము దేవిని జెఱగొనిపోవుచున్నవాఁడు. కన్నులార నే జూచి యూరకుండదగదు. ఇప్పుడే వీని శిరంబులు వ్రక్కలించి వైదేహిని విడిపించెద గాక; లేకున్న శ్రీరాము కార్యార్థమై ప్రాణంబులైన వీడెదగాక. వీనినింక బోనివ్వను.

24. అనుబంధము.

(రావణుని రథంబున కడ్డమేఁగి)

ఓరీ రాక్షసాధమా! నిలు. నిలు. బుద్ధిమంతుఁడవేని త్రిభువనవీరుండగు శ్రీరాము దేవిని విడిచిపొమ్ము. లేకున్న నిను ఖండించి నీ కండలు తుత్తునియలు గావించి నా బంధుగులకెల్ల విందొనర్చెద. దివికేగినను, దిక్కులబాఱినను, పాతాళంబు జొచ్చినను, సముద్రయంబున దాగినను, వెనువెంటనంటి, వినుమిక, మదీయ పక్షంబుల నీవక్షంబుఁ బగల్చి వైచెదను. (సీతనుగాంచి) తల్లీ! దుఃఖింపకుము. నీదాసుఁడ నేనుండ భయపడనేల? మదీయ తీవ్ర నఖంబుల నాతని శిరంబులఁజీల్చి దేవతలకు బలియొసఁగెద. నిన్నా భూపతి కడకు చనియెద. ఇంచుక నూఱడిల్లుము.

సీత——(జటాయువునుగాంచి.) అన్నా! మాయోపాయంబున, రామలక్ష్మణులవంచించి నన్నీనీచుండిటు కొనిపోవుచున్నవాఁడు. నీవు నాపాలిటి దైవంబుగ వచ్చినాడవు.

(జటాయువు రోషంబున రావణుని జూచి)

జటా—ఓరీ రావణా! పావనంబైన బ్రహ్మకులంబునఁబుట్టి, నీతి విరహితుఁడవై, పతివ్రతా తిలకంబగు సీనాతిం గొనిపోయి పుత్ర, పౌత్రామాత్య భృత్య వర్గంబులతో వినాశంబొంద నేల సమకట్టితివి? కోదండ దీక్షాగురుఁడు, దినకర కులజుఁడు, శ్రీరఘురాము డాదిదేవుండని యెఱుఁగుము. సామాన్య మనుజుండని దలఁపకుము.

చం॥ అలుగు నెయుక్కుగుండు కడునంగట మ్రింగిన నూఁచిచూచినన్
విలుగునె మేరుభూధరము, వెంగిలివై రఘురాము భామినిం
జెలగొని పోవఁజూచెదవు చెచ్చెర నిప్పుడ యోరినీచ నా
కలపిన బుద్ధిఁ గైకొనుము కాచెద జానకి డింపు మిమ్మహిన్,

రావణ—ఓరీ! ఊరకవదరక దారి విడువుము. లేకున్న నీశిరంబీశరంబునఁబడవై చెద.

జటా—(మహాకోపమున) ఓరీ! నిశాచరాధమా! శౌర్య విహీనుఁడవై రామలక్ష్మణులను మఱుఁగుపఱచి, వంచనోపాయంబున నీయుంచయానఁ గొని తేర సిగ్గించుకైన లేకఁ బ్రేలెదవు. మగఁటిమిఁగలవాఁడవేని నాయెదుటఁ బోర నిలువుము. లేకున్న జానకిండించి నీ వారిఁబట్టుము.

## 25. అనుబంధము.

రావణ—ఔరా! శవముల తిండిఁబువై పొగరెక్కి నిసరి తేరని విక్కెదవు. ఏమేమీ? జానకిండించి నేఁబురికేగవలయునా? లేకున్న నాతలలూడఁదీయుదువా? త్రిలోకకంటకుండగు

గీ॥ గాధి తనయుని యాజ్ఞంబుఁ గాంచు నాఁడు
దుష్ట రాక్షసి తాటకిఁ జంపు నాఁడు
కుమతి యగు నా విరాధుని గూల్చు నాఁడు
యొక్కరుండౌట నెఱుఁగవె యోరి నీచ!

మఱియు, ఖర దూషణాద్యనేక నిశాచరులం బరిమార్చినది యొక్కరుఁడుగాఁడె? అట్టి మహాబలుని నెయ్యంబు వీడి కయ్యంబు గాలొడ్డి చెడకుము. ఇప్పుడైన నా కోసలేంద్రునిఁ జేరి శరణు వేడిన, శరణాగత రక్షకుఁడుగాన, నీవొనర్చినట్టి తప్పు మన్నించి యభయమొసఁగ రక్షించును.

రా—తరుణీమణీ! నా శౌర్య ప్రతాపంబుఁ దెలియక నీ విట్లాడెదవుగాని యా రాముఁడు గీముఁడు నాకు సరివత్తురే?

ఏమో విశ్వామిత్రుని చెంతఁ జేరి యాడుగాండ్ర రాక్షసులఁ జంపిన త్రమున నే రాముఁడు శౌర్యవంతుఁడని పేర్కొనియెదవు. నీ బెదరు పలుకుల నే బెదరువాఁడను గాను

గీ॥ నాక మును జేగి దేవేంద్రు నణఁచి నాఁడ
మేటి మగటిమిఁ గైలాస మెత్తినాఁడ
పద్మభవునిచే వరముల వడసినాఁడ
నన్ను గెలువఁగ శక్యమె నరుల కబల.

(రథము సాగిపోవును.)

జ — ఓరి దురాత్ముఁడా! వినుము యోటమి లేకిటు తెచ్చినన్మహా
శూరుఁడ వైతివో? తలపఁ జోరుఁడ వీవు నరేంద్రుఁడున్నచో
శారద వల్లభుండు మనసారఁగ గాంచిన నీదు కంఠముల్
భూరి శరాగ్ని కీలలకు భోయన నాహుతి సేయకుండునే?



## చతుర్థాంకము—ప్రథమరంగము.

—:(o):—

(ఆశ్రమము సమీపించి-రామ-లక్ష్మణులు.)

రామ—అకటా! ఈ యాశ్రమంబంతయు వన్నెతగ్గి చిన్నవోయి యున్నది. పక్షులాకులతఁజెంది మేఁతమాని యున్నవి. సాధుమృగంబులెల్ల భీతిల్లినవలె దిక్కులను బరికించుచున్నవి. గోవులెల్లను దమ యునికిపట్టు మఱచి, మోరలెత్తుకొని కన్నుల నీరు నింపుచున్నవి. సారె సారెకు నా మనంబు దిగులు పొందుచున్నది. కడుపునఁ జేయి వేసి కల-సట్లున్నది. ఆశ్రమమును సమీపించు కొలఁది నా దంబు తత్తరించుచున్నది. సీనెందేగినను మరలివచ్చు తఱికి ముంగిలి కాచియుండి, ననుగాంచి నంతనె, పట్టరాని సంతసంబున నన్నెదురుకొని, నా కానందమొసఁగు, నేఁడేల కనఁబడదయ్యో? సత్వరంబున పర్ణశాల కడ జనియెదగాక. (పోయి) సీతా! సీతా! (అనిపిలువ ప్రత్యుత్త ముగానక విషాదమున) అయ్యో! పిలిచినఁ బలుకదేమి? (లక్ష్మణునిఁజూచి) తమ్ముఁడా! నాశరీరము కంపించుచున్న పర్ణశాల లోనికేఁజని కలయంగనుంగొనిరమ్ము. (లక్ష్మ ణుఁడు మరలవచ్చి) అన్నా! కుటీరంబునఁ గానఁబడదు. కుసుమాపచయంబునకై వెళ్లియుండనోపు. ఆ రామ బున కేగి జానకిం దోడ్తెత్తును. చింతింపకుము. (నిష్క్ర

రామ—చం॥ ॥పాలేఁతుక నెక్కడెత్తికొని పోయెనొ యొక్క
డ్రుంగెనో భయా! నలమునఁ గ్రాఁగెనో తరుణి
మునెందెనొ జీవమూడెనో| యలతులు గోయఁ

యెనొ ఫలావళి కేఁగెనొ యించువాంఛమై గొలఁకుల
కేఁగెనో నదికిఁ గోరికఁబోయెనో యెందుఁబోయెనో?

సీ॥ వన్య మృగములు పైఁబడి వనజముఖిని
బట్టి కొనిపోయెనో లేక పంకజాక్షి
దాఁగి యున్నదో యెందైన దరులమాటు
నేదియును దోచకున్నది నాదు మదికి.

(రాముఁడు శిరమువంచి చింతించుచుండ లక్ష్మణుని ప్రవేశము.)

లక్ష్మ—(స్వగతము) అక్కటా! ఎంత విపత్కాల మాసన్నమాయె? నేనింత తడవున్చినందున రాహుగ్రస్తుఁడగు రేరేని మాడ్కి కాంతిహీనుఁడై చింతించుచున్నట్టి యిన కులాధిపున కేమని విన్నవించువాఁడ. ( యోచించి ) ఎట్లయినఁ దెలుపక తప్పదు. (సమీపించ, రాముఁడు సంభ్రమమున)-సహోదరా! మహీజాత యెందున్నది. కనుఁగొంటివా?

లక్ష్మ—కం॥ చూచితి సానువు లందును
జూచితి గిరులందుఁ దరుల జొంపములందున్
జూచితి కాసారంబుల
జూచితి భూపుత్రి జాడ చొప్పడ దెందున్.

(రాముఁడు హా సీతయని మూర్ఛిల్లును.)

లక్ష్మ—హా! నిర్భరము. నిర్భరము. సతీవియోగంబు సహింపఁజాలక నత్యంత శోకంబుచే మూర్ఛిల్లెఁగదా? ఇంకెట్లు సుఖజీవియై యుండఁగలఁడు. భూమిజ లేని జీవనము నిరర్థకంబని భావించి ప్రాణంబులు విడుచునోకదా? అటుల

యున నే మని యోడఁగలనా? మా సమాచారం బెఱిఁగిన కౌసల్యా సుమిత్రలవ్వరో యీ లోకంబు విడుతురు......

హా! కైకా! నీనవతిపై సంవత్సరము సంపూర్ణముగ దీర్చు కొంటివికదా? పదునాల్గు వత్సరములు రాముఁడరణ్య వాస మొనర్చునట్లును, నీపుత్రుఁ డంతకాలము రాజ్యమే లునట్లును వరమొందితివి. ఇఁక నీ పుత్రుఁడే స్థిరముగ రా మేలవలెను. (కోపమున) విధాత్రు వశమున నొక వేళ రామునకుఁ గీడొదవునేని పాపాత్మురాలైన భరతుని నిన్ను యమసదనమునకు బంపి యసువులు వీడెదగాని నే నూ రక విడుతునా? (యోచించి) ఆ మంగళంబు ప్రతిహతం బగుగాక. ఆకల్యాణ రాముఁడు జానకితోఁగూడి సుఖమై యుండుగాక... ...హాతల్లీ! శ్రితజనకల్పవల్లీ! ఎటనున దానవో? యెట్టికష్టంబులఁ జెందుచున్నదానవో కదా! ప్రాతఃకాలమున నిత్యంబే యెవరికి నమస్కరించి నుతియించు చుంటివో? యెవరిని సేవించి కృతార్థత నొందుచుంటివో? యెవ రిని దలఁచి పుణ్యం బాపాదించు కొనుచుంటివో? యీ మాత, సుగుణోపేత, భూజాత నేడు కానఁబడదయ్యె.

ఉ॥ నెమ్మి దలిర్ప నా మిగుల సేవనితో మణి పాదముల్ వెస
సమ్మతితోఁ జేరి మనసారగ మ్రొక్కుచు నుండగంటి నా
కొమ్మ గనంగరాదిట నికుంజము తోచెడు కాంతిహీనమై
యిమ్మహి నెట్లు ప్రాణములు నిల్పి భరింతు చరింతు మాతరో!॥

హా! దుఃఖము దుఃఖము. సీతా వియోగము సహింపఁజాల రాముఁడు గాఢ మూర్ఛాక్రాంతుఁడై యున్నవాఁడు. అంతకం తకు నామనంబున గడు దిగులు పొడముచున్నది.

గీ॥ అంత కంతకు శ్రీరాము డార్తిఁ జెంది
ప్రాణములు వీడఁ గనిరి భరతుఁ డపుడు
యమునిఁ గడ కేగు శత్రుఘ్నుఁ డవని భారము
సరయు రఘునంశ మంతట నంత మొందు ॥

అయ్యో! ఆ దేవి నను బాయఁ గనినంతనె తరుల చాటున నెం దైన నుండక నధిక కోపంబున వెనుక నాం దరయక, నే జేసిన కార్యంబున కేమని చింతించుచున్నాఁడ?...... చేసిన కార్యంబునకు వగచి ప్రయోజనం బేమి? భూనాథుని నేఁ దీర్చి యీవల కర్తవ్యము నాలోచింప నగును. (శైత్యోపచారముల నొనర్చ రాముఁడు తేఱి యెదుట నుండు లతాజాలము గాంచి సీతయను భ్రాంతి చే.)

గీ॥ హా! లతాంగి యింతదనుక నక్కటకట
యొందు జనితివి తెలుపుము యిందువదన
వెదకి కానక నేనంత వివశుఁడైతి
తరుణి నన్నింత కొందింపఁ దగదు నీకు॥

(సమీపమున కేగ నతని కానుపించు లక్ష్మణుని జూచి)

లవరజా! శుక కోకిలా లాపంబులు సీత పలుకులుగాను, లతలు సీతమేనుగాను, దలంచి పేర్కొనుచున్న నామతి భ్రమతను గాంచి నవ్వకుము. పుత్ర వియోగంబున మనజనకుఁడు మరణించె. నేను గళత్ర వియోగంబున జీవింపఁ జాలను. ఇఁక నీవయోధ్యకేగి తల్లి కౌసల్య నూరడించి నానాఁటుగ నీవు సేవ లొనర్పుము. శత్రుఘ్నులు దుఃఖ పడకుండునట్లు యోదార్పుము- నాకై నీ వెట్లు ప్రవర్తించుచున్నాఁడవో యట్లనే భరతుని సేవింపుము.

రాజధర్మంబు లేమరకుండ నడుపుము. తమ్ముఁడా! నే నీ శరీరంబు యోగమార్గంబున వీడెద.

సీ॥ పుత్రశోకంబున బోఁగలేడు నాతల్లి
దరిజేరి నీవుయోదార్పుమన్న
సురుజనంబులకెల్లఁ బదువడి నామారు
చరణ పద్మంబుల కెరఁగుమన్న
మంత్రులకెల్ల నా మాటగా ధర్మంబు
నిలుపుట మేలని తెలుపుమన్న
భరత శత్రుఘ్నులు బహుశోకమునుజెందఁ
దగురీతి బోధింపఁ దడయకన్న।

గీ॥ బంధువులఁజేరి యూఱటఁబలుకుమన్న
చేరికైకేయి కీవార్తఁజెప్పుమన్న
మమత విడనాడి పురముకు మెరలుమన్న
మదిని నామాట నేప్రొద్దు మఱవకన్న.

లక్ష్మ—అన్నా! ఇట్లు శోకింపఁదగదు. సర్వజ్ఞుండవై నీవిట్లాడిన నేమన్ని వచించువాఁడ. నీవంటి విజ్ఞానవంతు లాపదలఁ ధృతివీడుదు రే?

కం॥ దుఃఖము ధైర్యముఁ జెరుచును
దుఃఖము రోగంబు బెంచు దుర్బలు జేయుఁ
దుఃఖము కార్య విఘాతము
దుఃఖము విడనాడ శుభము దూకొనుపేర్మిఁ॥

గీ॥ విల్లు నీవంద జగములు తల్లడిల్లు
దివిజులైనను నీదిక్కుఁ జేరి చూడ॥
వెదకి యెటనున్న జానకి తెఱఁగు గాంచి।
తెచ్చి యివ్వరె వెంటనె దీను లగుచు.

అన్నా! యోచింపనేల? ఇందెందైన నున్న దేమో బా గ పరిశీలింతము రమ్ము.

రామ—సీ॥ పోదమా లక్ష్మణా భూమిజ వెదకంగ
నొలసి యీ పొదలలో నున్నదేమొ
పిలుతమా లక్ష్మణా పృథ్వీతనూజాత
యోటమి నెందైన నున్నదేమొ
కాంతుమా లక్ష్మణా కంజాత లోచన
గాతమీ తీర్థంబు కరిగనేమొ
చూతమా లక్ష్మణా చూత పల్లవపాణి
నెత్తమ్మి కొలంకుల కేగనేమొ॥

గీ॥ కోరి పుష్పముల కేగనో కోపులాంగి
బాల ఫలముల కేగనో జాలిమీఱి
తరుల మఱుంగున కేగనో తరుణిమిన్న
దాగి యున్నదో యెందైన ధాత్రి తనయ.

(ఆకాశమునవలోకించి) భూతములు నెత్తుకొని పోయెనో యక్షులు డాచిరో, గంధర్వులు మాటుచేసిరో, దేవతలు దొంగిలిరో దనుజులు చెఱఁబట్టి కొంపోయిరో కదా! లేకున్న నింతగ విలపించినను గంగ కావరంబున నా యండజవేణి జాడ దెలుపక ... కించక నున్నారు. నా కోపాగ్ని కింధనములట్లీ బ్రహ్మాస్త్రంబు బ్రయోగించి, బ్రహ్మాండకటాహంబు బ్రద్దలుగావించి సర్వప్రాణులను సంహరించెద గాక. (బాణము సంధించును, లోపల గొంతుక) లక్ష్మణుఁడు కరంబుబట్టి

కం॥ జగములు సృష్టింపంగను
జగములు రక్షింప మఱియు జగములు పెంపన్
జగదీశుడవై యిపుడిటు
జగములు స్త్రీకై హరింపఁ జనునే రామా!

8

అగ్నిహోత్రమున కుష్ణంబును, శశాంకునకు శీతలంబును, వాయువునకు వేగంబును స్వాభావికంబై యున్నట్లు శాంత గుణము నీకు నైజమై యున్నది. దుష్టులను మర్దించి లోకంబునకు మేలొనర్ప వలయుఁగాని సకల జీవుల సంహరించుట పాడికాదు. కోపోద్దీపితుఁడవై కోదండంబు చేబూని నంతనె నీ తేజంబు వీక్షింప జాలక లోకంబులు తల్లడిల్లుచున్నవి. నీ కప్రియం బొనర్చు వాఁడె వఁడైనఁ బ్రతికి పోగలఁడా? నీకపకార మొనర్చిన పాపాత్మునిఁ బట్టి శిక్షింపవలయు గాని నిరపరాధుల నేచుట యుచితంబు కాదు. ఇప్పట్టున నా పలుకులాదరించి శాంతి వహింపుఁడు.

రామ — తమ్ముఁడా! నీ యుక్త వచనంబులకు సంతసించితిని. మహీ జాత యెందున్నది. మనమెయ్యెడ వెదకఁజనవలయు.

లక్ష్మ — ఈ జనస్థానంబెల్లఁ గలయ వెతకుదము రమ్ము. (నిష్క్ర)

చతుర్థాంకము — ద్వితీయరంగము.

(అరణ్యము జటాయువు పక్షములు తెగిపడియుండును)

(రామలక్ష్మణులు దూరమున)

రామ — సీ॥ ఫణిరాజ కానవే ఫణిరాజ సమవేణిఁ

మధుపంబ! కానవే మధుర వాణిఁ

నాళీక కానవే నాళీక సమనేత్రఁ

గలహంస! కానవే కంబుకంఠి॥

కరిరాజ కానవే కరిరాజ గమనను

ముకురంబ! కానవే ముకుర గండిఁ

చాంపేయ కానవే చాంపేయ సమగాత్రిఁ

హరిణంబ! కానవే హరిణ నయన

గీ॥ జంచరీకము! కానవే చంచలాక్షిఁ
గుందమందార! కానవే కుంద రదన
నవని తనయను కానవే కువలయంబ
నలరువనజము! కానవే యలరుబోణి.

లక్ష్మణా! గిరి దుర్గ శైల వనంబులెల్లఁ గలయ వెతకితిమి. ఎందునుగాన బడదుకదా!......హా ప్రాణప్రియా! నీవు లేని లోకమునా కేల?

సీ॥ జనకజ!నీవు నన్నెడబాయ కున్నాళ్ళ
రణ్యంబె దివ్యపురంబు నాకు
నెలతరో! నీవు నన్నెడబాయ కున్నాళ్లు
జంతువర్గమె బంధు చయము నాకు
జలజాక్షి! నీవు నా జంటబాయని నాళ్లు
తాళకుటంబె సౌధంబు నాకు
ఎలనాగ! నీవు నన్నెడ బాయ కున్నాళ్లు
శర్కరిలమె మృదుశయ్య నాకు!

గీ॥ బాల జానకి నన్నెడ బాయు కతన
ములుకులై తోచెఁ జెవులకు చిలుక పలుకు
కటువు గాదోచెఁ గోయిల కంఠరవము
హేయమై తోచెదఁదకు నా కాయమకట!!

తమ్ముఁడా! సీతా వియోగంబిఁక నేనొకనిమిషంబైన సహింపఁజాల. ఈదేహంబు విడనాడి దివంబున కేగద......అక్కటా! నావంటి దుర్భాగ్యున కిటులెట్లు సమకూరఁగలదు?

సీ॥ తనువును విడనాడి దశరథు కడ కేను
పోవుచు నేరీతి బోవువాఁ
వ్రతము నిందింపక వచ్చిన దేమన్న
బదులు నే నేమని పలుకువాఁ
బదునాల్గు యేఁడులు వనపడి నిండించి
పురికి నే నేమని పోవువాఁ
బోయిన జనకుఁడు పుత్రిక నేమంచు
నడిగిన నేమని నుడువువాఁ
వరుఁడైన నాతెంటి వైదేహి నడిగిన
భరతుని కేమని పలుకువాఁ
నాతుఁడాంబు వచ్చి సీతను నడుగంగ
నేమని మాతకు దెలుపువాఁ
గీ॥ అన్న లక్ష్మణ యెన్ని చందాలనైన
లేదు సౌఖ్యంబు నాకిక లేదు లేదు
దేహ యాత్రను నిచట నే దీర్చుకొందు
పురికి శీఘ్రంబె నీవిఁకఁ బోవుమన్న.

లక్ష్మ—అన్నా! ఆపత్కాలంబున ధైర్యంబు వహింపవలయుఁ. సామాన్యునివలె దుఃఖింపఁ గార్యమెట్లు సమకూరఁ గలదు. ఆపదలను బొందని వారెవరు! తొల్లి దేవేంద్రుఁడు సైతము దేవరాజ్య భ్రష్టుండై యడవులఁబడి భార్యావిహీనుఁ దుఃఖపడ లేదా? మనవంశంబున సత్యసంధుండైన హరిశ్చంద్రుఁ డెంత కష్టంబు లనుభవించెనో తలఁపుము? పరిశోధింపఁ దగిన స్థలములు మెండుగ గలవు. — రమ్ము.

ప్ర బంధ ము.

రామ—పుణ్యాత్ము లెవ్వరైనఁ బుడమితనయ జాడఁదెలిపి పుణ్యము కట్టుకొను వారీయరణ్యంబునఁ గాన రారుగా? ఇఁకనెయ్యది తెఱపు. (ముందుపరికించి) లక్ష్మణా! ఈయెడ విఱిగిన రథము, తునిసిన పక్షములు, భగ్నమైన ధనువు, నుగ్గునూచైన బాణములు, కానఁబడెను మఱియు, ధాత్రీతలంబంతయు రక్తసిక్తంబై ఘోర సమరతలంబుఁబోలె చూపఱులకు వెఱపుఁ గొల్పుచున్నది. అందందు విరులు నేలంబడి యున్నవి. (జటాయువును గాంచి) అక్కటా! యీ క్రూర దైత్యుఁడు భూమిజను బట్టి భక్షించి యుండనోపు.

26. అనుబంధము.

తమ్ముఁడా! కంటివే? జనకజనుబట్టి కబళించి నేలంబడియున్న రాక్షసాధముని.

గీ॥ జానకిని మ్రింగి నిజరూపు కానకుండ
దోషుఁడై రక్కసుఁడు పక్షి వేషమునను
వేఱు రూపంబుఁ జేకొని వెఱపు లేక
నవని బడియున్న వాఁడిడె యనుజగనుము!॥

ఈక్షణంబున వీనిఁద్రుంచి వైచెద. (బాణమును సంధించును)

జటాయువు దీనస్వరమున.

గీ॥ రామ శ్రీరామ రఘురామ రామచంద్ర!
పంక్తిరథుఁడగు మీతండ్రి బాల్య సఖుఁడ
నరుణ తనయుఁడను జటాయు వందు రిలను
రక్కసుఁడగాను శరణార్థి రఘుకులేశ.

(రాముఁడు వెఱఁగుపడి) అయ్యో! జటాయువా! ఏల నీకిట్టి యాపద సంభవించెను?

జటా—శ్రీరామచంద్రా! నీసతి సీతాదేవిని, దుష్టుఁడైనదశకంఠుండు మిమ్ములను వంచించి యెత్తికొని పోవుచుండ నాదేవి యార్తారవంబు విని, నాని నెదలించి కదనంబునకుం గడం గితిని. క్రూరుండు నాయఱకలం దెగనఱికి నన్నీ పుడమిం బడవైచి వైదేహిం గొని చనియె.

(రాముఁడవనిపైబడి ‹హా సీతా!యని మూర్ఛిల్లును.)

లక్ష్మ—అకటా! సీతాదేవి చెఱఁబోవుటకు శోకింతునా? రాఘవుం డను గడుగునను మూర్ఛిల్లుటకు చింతింతునా? అయ్యో! దైవమా! యిట్టి సంకటములు మాకేల కలుగఁ జేసితివి?

(శైత్యోపచారములచే రాముఁడు లేచి)

రామ—సీ॥ కుటిల రాక్షసుఁడటు కొంపోవఁ దఱితన
వారులేమికి యెంత వగచెనయ
తలపంగరాని యాదైత్యుచే జెఱఁబడి
చింతచే నన్నెంత చీరెనయ
కడకతో సౌమిత్రి కాపాడ రాడని
పొరి పొరి యెంతగా బొగిలెనయ
పలుమాఱు పేర్కొన్న బాటింప రాడని
శశిముఖి యెంత వేసారెనయా
గీ॥ తల్లి దండ్రుల నెంతగా దలఁచెనయ్య
బంధువుల నెంచి యేమని పలికెనయ్య
తనదు చెల్లెండ్ర నేమని తలఁచెనయ్య
దేవి వృత్తాంత మంతయు దెలుపుమయ్య!

ఖగకులోత్తమా! ఆరాక్షసుండే దిక్కునకుఁ గొంపో వాడెట్టివాఁడో? నాకెఱుఁగించి పుణ్యము గట్టుకొనుము.

జటా—మహీశా! వాఁడు విశ్రవసు బ్రహ్మకొమరుఁడు. దశకంఠుఁడను పేరఁ లంకారాజ్యంబు నిరంకుశంబుగ నేలుచుండు. అతి కామలోలుండై గర్వంబునఁ జపలబుద్ధిచే నీదేవిని యెత్తికొని దక్షిణదిశ కేగినాఁడు. రామా! జానకీ మనఃకామా! ఏల దుఃఖించెదవు? నీ కెగ్గొనర్చిన రావణుఁడు నిక్కముగ నీ చేనీల్గఁగలఁడు. సందేహంబువలదు. శీఘ్రంబుననే మగల వైదేహిం బొందఁగలవు. ఈవృత్తాంతము నీకుఁ దెలుపుటకై యతికష్టమున నే బ్రాణంబులు నిలుపుకొని యున్నాఁడ. చిదానంద మూర్తివైన నీసన్నిధి దేహంబు విడనాడి శాశ్వత స్వర్గ సుఖంబు లనుభవింపఁగంటిని. రామా! నీచరణ పద్మంబు లొకసారి నన్నంటనిమ్ము. (రాముఁడు సమీపము నకురాగ జటాయువు నమస్కరించి, ప్రాణములు, విడచును)

రామ-(శోకమున) గీ॥ అకట! నా జనకుని మరణంబు కన్న
తరుణి జానకి చెఱబోవు దానికన్న
నాకు గానిట మార్కొనియాజియందు
బడిన పక్షికై నాకెంతొ వగజనించె॥

తమ్ముఁడా! నాకై నచ్చి రావణునిచే మృతినొందె. మజ్జనకుని యట్లుపూజ్యుఁడు. కావున నీగోదావరీ తీరంబున నగ్నిసంస్కారంబు గావించి పుణ్యలోకంబున కనిపి వెళ్ళుదము. (నిష్క్ర—)

చతుర్థాంకము—తృతీయరంగము.

(మతంగముని యాశ్రమము. శబరి ఫలములను గోయుచుండ రామ లక్ష్మణులు ప్రవేశము.)

27. అనుబంధము.

శబ—సుగుణ గుణధామా! దైత్యకులభీమా! సురారిమదవిరామా!

జానకీ హృదయకామా! రామా! నిన్ను [illegible] వీక్షింప నగునా? నీ చరణపద్మంబు లింకెన్నఁడు సేవింపనగును? ఈ ఫలంబులు నీ కెన్నఁ డర్పింపనగును?

రామ—తమ్ముఁడా! [illegible] కునికిపట్టగు నేకాంతవనంబున నన్ను దలంచువా రెవ్వరై యుందురు?

లక్ష్మ—అన్నా! ఇంతకుమున్ను మనచే శాపవిమోచనుఁడై కబంధుఁ డుగ్గడించిన తపస్విని శబరిగా నుండనోపు.

రామ—(శబరినిగాంచి) ఆహా! ఆ తపస్వినియే ఫలములఁ గోయుచు నన్నుగూర్చి ప్రశంసించుచున్నది. తే[illegible]మురయనగును

(సమీపించి) గీ॥ జప తపంబులు జరుగునే చక్కఁగాను?
మునుల తోఁబాటు కలదొకో? మోదమొప్పు
గురుజనంబులఁ గొలుతువె కోర్కెమీఱ
సౌఖ్యమే వేళ నబ్బునే శబరినీకు.

శబరి—ఇన కులాంబుధిసోమా! బుధజన స్తోత్ర పవిత్రనామా! రామా! నాగురువుల యాజ్ఞానుసారంబున నే దీర్ఘకాలంబుగ భవదీయ దర్శనంబునకు వేచియున్నదాన. కరుణించి యీదివ్య ఫలములను గైకొని నన్ను ధన్యురాలిఁ జేయుము. నేఁడు మీపాదసేవ కలిగినందున నాజన్మము పావనంబయ్యె. ఇది మిచ్చట నిలిచి నాకు ప్రమోదంబుఁ గలుగఁజేయ వేఁడుచున్న దాన. (ఫలములిచ్చు రాముఁడు చేకొని)

రామ—శబరీ! నీవు చేయు సత్కారంబున కెంతేని సంతసించితి. ప్రాణేశ్వరి వియోగంబున నేనొక్కయెడ నుండనోప. నీ వనార్త్తను జక్కడివంగాని నామనంబు శాంతింపదు.

శబరి——రామా! రాజీవదళాక్షా! పరాత్పరుండవైన నీమాయావిలాసంబుఁ దెలియ నెవరికి శక్యము. రావణునిఁ బరిమార్ప సమర్థుండవయ్యు సహాయంబులేక నొంటిమై చనవలదు. సహాయంబున్న గార్యంబు సులభ సాధ్యము. ఈసమీపంబుననే ఋశ్యమూకాద్రియందు సుగ్రీవుఁడను వనచరుఁడు మహాబలశాలి యున్నవాఁడు. కొండొక కారణంబున వాలివలన భీతిచే భూమండలంబంతయుఁ దిరిగి సకల దేశంబులను గాంచియున్నవాఁడు. అతని సహాయంబున నిర[illegible]యంబుగ సీతను సాధింపనగును. మీరీ త్రోవఁబోవ పంపాసరోవరంబు గానుపించును. అటవిక్రమించి సుగ్రీవునితో జెలిమి సంపాదింపుఁడు.

రాము——(సంతోషమున) శబరీ! నావిజయము పేక్షించి నీవాఁడిన పలుకులకుమిగుల సంతసించితిని. నే నాకపివీరుతోన సఖ్యంబప శ్యంబు గావించెదను. నీయీప్సితంబేమైనఁగలదేని వేఁడుమిచ్చెద.

శబరి——గీ॥ గురుజనాజ్ఞాను సారంబు నరవరేణ్య
నీదు పదసేవ జేసితి నిండె తపము
పుణ్య లోకంబుఁ జేరెదఁ బొలుపుమీఱ
నాదు దేహంబు విడనాడ నానతిమ్ము॥

దేవా! నాకింతకన్న నుఱేమియుఁ గోరిక లేదు.

రామ——మహా తపస్సంపన్నులు కెట్టిలోకంబు గలుగునో యాపుణ్యస్థానంబు నీకును గలుగుఁగాక. (తెరపడును)

చతుర్థాంకము——చతుర్థరంగము.

(ఋశ్యమూకప్రాంతము. పంపాసరోవరము. రామలక్ష్మణులు.)

28. అనుబంధము.

లక్ష్మ——అన్నా! అశ్వత్థ వట మలయజాది ఛాయాప్రధాన వృక్షంబులచేతను, దాడిమీ కపిత్థ చూత కదళీ పనస జంబూ

జంబీర నారికేళాది ఫలభూరుహంబుల చేతను, పున్నాగ కేతకీ వకుళ పారిజాత పొగడ పొన్న మల్లె మొల్ల జాజి లతాది సుగంధ తరుజాలంబులచేతను, శుక పిక శారికా రవంబులచేతను, మధుర మధుప ఝుంకారంబుచేతను, జల్లి గాడుపులచేత నెప్పారు నీపంప సొంపు వర్ణింపఁ దరంబు గా కున్నది కదా?

రామ—(విరహతాపంబున)

సీ॥ అనుజుఁడ! తలపంగ వనసీమఁగాదిది
కాముని యాయుధాగారమయ్యొ
చింతింప నలమావి చిగురులు గావివి
కంతుని క్రొవ్వాఁడికత్తులయ్యొ
భావింప విరిపూవుబంతులు గావివి
యంగజు పుష్పబాణంబులయ్యొ
పరికింప శుకపిక స్వరములు గావివి
కర్ణకఠోరహుంకారమయ్యొ॥

గీ॥ సుందరంబగు యౌవన శోభితంబు
పడఁతి నెడబాసి విరహతాపంబుచేతఁ
బొక్కుచుండెడి మానసంబునకు వెతలు
యినుమడించెను నేనిట నిలువగలనె?

నావంటి యంగనారహితు లెందు రాదగునా? ఇఁక నేనేమిసేయుదు? రామామణి సీత నెట్లు కనుగొందు? ఎన్నటికైన సీతతో నీపంపా సరోవర సంపదను గొల్లలాడు భాగ్యంబు నాకున్నదో లేదో కదా? భూపుత్రిక వదనమెప్పుడు వీక్షింతు? ఎప్పుడువిహరింతు? నాముచ్చట లెప్పుడు నెఱవేఱును? అయ్యో! ఎక్కడితలపోత? ఇంకెక్కడిసీత ఎక్కడిభోగము? ఎక్కడియనురాగము? ఎక్కడి రాముడు?

లక్ష్మ—రామా! చింతించకుము. శబరి చెప్పినచొప్పున వనచంద్రుని గూడి సీతను సాధింతము.

రామ—(దృష్టిసారించి) శుభసూచిక శకునంబు లనేకములు పొడ సూపుచున్నవి. కాన కపికులోత్తముని సఖ్యంబవశ్యంబు గలుగును,

లక్ష్మ—మార్గాయాసం బుపశమింప గొంతదడవిందుండి యావల సుగ్రీవునిఁజూడ వెడలుదము. (రామ లక్ష్మణులా సీనులై యుండెదరు. (వెనుక తెరయెత్త బడును.)

(ఋశ్యమూకము--హనుమంతుఁడు సుగ్రీవుఁడు.)

(సుగ్రీవుఁడు రామలక్ష్మణులను గాంచి భయాకులచిత్తుఁడై)

29. అనుబంధము.

సుగ్రీ—అంజనాపుత్రా! ఆ పంపయందుండు నరవీరులఁగాంచుము. శరచాపహస్తులై మునివేషంబులఁ ధరించి రాజవరు లిరువురు తేటిచూడరాని తేజంబున విరాజిల్లుచున్నారు. ఆవాలి చేఁబేరితులై ప్రచ్ఛన్న వేషమున నన్నుఁజంప వచ్చియుండ నోపుదురు. సిరినిగాంచ నామనంబు కలవర పడుచున్నది. ఇంక నిందుండఁజనదు. శీఘ్రుంబె వేఱొకచోటికిఁబోవుదము.

హను—గీ॥ వెఱపు వీరలు ప్రచ్ఛన్న వేషులైన
మానవుల మాడ్కి నామది గానరారు
పుణ్య మూర్తులు సర్వత్ర పూజ్యులరయ
జాఁడ తెలియక నెందైన జనగనగునె॥

గ్రీ—అటులైన నీవరిగి వారల తెఱంగరయుము, ఇటకే కారణంబున వచ్చియున్నవారో సవిస్తరంబుగ దెలిసికొని రమ్ము. నాలోనిభీతిఁబాపుము. నాసంశయంబెల్ల దీర్పుము.

హను—కపికులశేఖరా! భీతిల్లకుము. మాఱువేషంబున నే వారల చెంతఁజేరి మనోవృత్తి గ్రహించి నీసంశయంబెల్ల బాపెద. ఇదే వెళ్లుచున్నవాఁడ. (నిష్క్ర.)

(వటుని వేషంబున హనుమంతుఁడు రామలక్ష్మణులను గాంచి నమస్కరించి.)

సీ॥ అశ్విను లో సూర్యచంద్రులో విశ్వమెల్ల
దివిరి రక్షింప వచ్చిన దేవ వరులొ
మునుల వేషంబులను దాల్చి మోదమెసఁగ
దిరుగ నేటికి మీరిటు ధీరులార!॥

మహాత్ములార! త్రిభువనంబులు పాలింప సమర్థులయ్యు ముని వేషంబులను దాల్చి శరచాపహస్తులై యుండగతంబేమి? మీరెవ్వరు? కలతెఱఁగు నెఱుఁగించి సంతసింపఁ జేయ వేడుచున్నాఁడ.

లక్ష్మ—సీ॥ దశరథుండను పేరి ధరణీపాలాగ్రణి
కగ్రపుత్రుండు నాకగ్రజుండు
సర్వభూత హితుండు జనతా శరణ్యుండు
విక్రమక్రమశాలి విజయశీలి
రాముఁడీ సుగుణాభి రాముండు జనకుని
సత్యంబు నెఱప రాజ్యంబు విడిచి
తనపత్నియును దాను వనమున కేతేర
రక్కసుఁడొక్కఁడీ రాజుదేవి

ఆ॥ విపుల పుణ్యసీతఁ గపటియై కొనిపోయె
నేము లేనిచోట నేమువాసిఁ
గానకెల్ల దిశలుఁగలయంగ వెదకుచు
దిరిగి తిరిగి యొక్కసరణి రాఁగ॥"

కబంధుఁడనువాఁడు మాచే శాపవిమోచనుఁడై మీవృత్తాంతమెల్ల మాకెఱుఁగింప సుగ్రీవుని సఖ్యంబపేక్షించి యేమిటకు వచ్చియున్నవారము. వీరవర్యా! వటుని తెఱఁగున మాతో నెయ్యం గావింపవచ్చిన నీవెవరవు? మాకుఁ దెలియబలుకుము.

హను—(సంతసమున) "కం॥ తపన తనూజుని సచివుఁడఁ
గపిమూ ర్తిని గానురూపిఁ గామగముఁడఁగా
డుపుతనయుఁడ హనుమంతుఁడ
గపటపు భిక్షుకుఁడ దూతకార్యమ్మునకున్॥"

దేవా! నే నీ మాఱురూపంబున మీకడ కేతెంచినందులకు క్షమింపుడు. వాలిపంపున మీరరుగుదెంచి నారనెడు భీతిచే భిక్షుకుని రూపంబున వచ్చినాఁడ. మున్ను వాలితో యుద్ధంబు పలుమాఱు సలిపి, యలసి, సోడి, భార్యంగోలుపోయి, సుగ్రీవుఁడీ ఋశ్యమూకంబున నున్నవాఁడు. మిమ్ముల గనుఁగొని మీవృత్తాంతమంతయుఁ దెలిసికొని రమ్మన్న నేను వచ్చినాఁడ.

రామ—వాయునందనా? నీ యాగమనమునకు మిగుల సంతసించితిని. సూర్యపుత్రుండగు సుగ్రీవునకును సూర్య వంశోద్భవుల మగు మాకును సఖ్యంబు ఘటింప సులభముగ నిరువుర కార్యంబు సిద్ధింపఁగలదు.

హను—దేవా! సఖ్యమునకు సందియంబేల? అవశ్యంబు గార్యంబు నెఱవేఱఁగలదు. ఈపర్వతంబుననుండు సుగ్రీవుని కడకు మిమ్మిరువురను నా భుజమూలంబులపై నెక్కించుకొని నే గొంపోయెదను విచ్చేయుఁడు.

రామ—వలదు వలదు. మేమే యాహనుమంతమునకు రాగలము. పోదము లెమ్ము. (నిష్క్ర.)

(రామలక్ష్మణులు హనుమంతుఁడు సుగ్రీవునికడకు ప్రవేశము.)

ను—(సుగ్రీవునిగాంచి) కపిసార్వభౌమా! నీపూర్వపుణ్యఫలమేమ నవచ్చు. ఈపురుష వీరులతోఁడ నెయ్యంబు సంపాదింపఁ గంటివి. ఇఁక నీవు శత్రువును సాధించి మరల నీప్రాణ సఖిం గూడి కిష్కింధ రాజ్యంబవలీల నేలఁగలవు. వీరు దశరథ మహారాజుతనూజులు. రామలక్ష్మణులు. కాలవశంబునఁదావ

ణునిచే, రాముండు భార్యంగోలుపోయి నీసహాయంబున థింప వచ్చియున్నవాఁడు. వాలిచే బంపఁబడిన కపట మా నులుకారు.

సుగ్రీ—(హనుమంతునిఁ కౌఁగిలించుకొని) మారుతీ! నీకుఁగల స్వామిభక్తికిఁ గడు మెచ్చితి. నీవలనగదా? నాచింతలెల్లఁ బ యగంటి. ఈపురుషసింహుల చెలిమి సంపాదింపఁగంటి ఆహా! నీ వొనర్చినట్టి యుపకారమునకు కడుంగడు సంతోష మయ్యె. (రామ లక్ష్మణులనుగాంచి) మహాత్ములారా! మిమ్ముఁగాంచినంత నే ధన్యుఁడనైతిని. నామనోభీష్టము నే వేఱఁగంటి. మీవృత్తాంతంబెల్ల హనుమంతునిచేవింటి. మీ తోమైత్రిఁ జెందియుండ నామనం బువ్విళ్ళూరు చున్నది. టినుండి మీభృత్యునిగా నన్నను గ్రహింపుఁడు.

కం॥ వచ్చెద నీసతి వెదకీటు
తెచ్చెద నెందున్నఁగాని దివిజులు పొగడన్
జొచ్చెద సాగర మింకిన
నచ్చుగ నాప్రతిన తప్పదవనీనాథా!॥

మనో వాక్కాయ కర్మంబుల వేఱొండు దలఁపక, కడు సంత సంబున, మీమైత్రి యొనర్చినందునకీపంచభూతంబులే సాక్షి. ఒకవేళ సాగరం బింకినను, పద్మమిత్రుని ప్రభమాసినను, మేరునగము చ లించినను, నాపలుకెన్నండునుగల్ల కాదు. రామచంద్రా! యిందు మాఱు చరింతునేని, సురాపాన, బ్రహ్మహత్యాది మహా పాతకము లొనర్చువారరుగు నరకంబునకు నే బోవువాఁడ. (నమస్కరించును.

రామ—(లేవనెత్తి) గీ॥ కపి కులాధిప సుగ్రీవ! గతముదలఁచి
వగవ నేటికి? నీదగు బగతు ద్రుంచి
సకల విభవముతోగూడ సంతనంబు
దనరఁజేసెద నాయాన తప్పు దెవుఁడు.

వనచరశేఖరా! నీపలుకుల కమంబానంద మొందితిని. నా
భ్రాతాదరుని మాడ్కి నినుంగౌరవించెద. నేడాదిగ మనమన్యోన్య
మిత్రత్వము చే మెలంగ వగుదు. నీశత్రువగు వాలిమృతినొందిన
నిగా దలంపుము. ఏలికవై కిష్కింధ రాజ్యంబును బరిపాలింప
లవు......సుగ్రీవా! నాకొక సంశయంబు తోచుచున్నది. నీవు
లి కవలవారయ్యు మీలోమీకు విరోధం బేలవాటిల్లె?

గీ— సీ॥ జననాథ! మాయావి యనువాడు తనకంటె
బలియుండు లేడనివాలితోడ!
బద్ధ వైరము బూని యుద్ధము సేయంగ
వాలిశక్తికి వాడు తాళలేక
పఱుగిడి యొకగుహ వెలుపున చొచ్చంగ
వెంటనే వాలియు వేగ మరిగె
వెలుపల నేనుండ వెలువడు రుధిరంబు
కనుగొని శోకంబు కడలుకొనంగ

గీ॥ శత్రు వసిచేత నావాలి చచ్చెననుచు
దలంచి కిష్కింధ రాజ్యంబు ధర్మ మెనంగ
చాల సుఖములు వడయుచు నేలు చుండఁ
గొన్ని దినములు కడచెను గోసలేంద్ర!

అచ్చట వాలి మాయావిం దునుమాడి, గోపాయత నే
నాచెంతకు వచ్చి, తన్ను వంచించిన వానిగా దలంచి, నే
విన్నవించు కొనినను, బెడ చెవులంబెట్టి, నన్ను రాజ్యభ్రష్టు
వించి, నా ప్రాణనాయకి, రుమను, సైతము తా గ్రహించి,
త్రివరులతో నన్ను సమయింప నుపక్రమించెను. అంత నేను
ం బఱువిడ, నావెంటనంటి, సప్త సాగరంబులు కలయం
ట్టకేలకు నే నీ ఋశ్య మూకంబుఁజేరితిని. మతంగముని
పంబున వాని యుందురావెఱచి, నను వీడిచనియె.

రామ—ఏకారణంబున ముని వానికి శాపమొసఁగె?

సుగ్రీ—దుందుభి యను దనుజుఁడు వాలిని సమరంబునకుఁబిల్వ నా దైత్యునితో యుద్ధమొనర్చి, వానిఁగూల్చి, పర్వతోపమానంబైన, వాని కళేబరంబు నెత్తుఁరొలుక పాదంబునఁ జిమ్మ నయ్యది, యోజన దూరంబునందుండు మతంగముని యాశ్రమమునఁబడియె. అందు కాముని యాగ్రహించి, యా పర్వతం బెక్కిన మడియునని వాలికి శాపంబిచ్చె. ఆ దనుజు కళేబరం బించుక దూరంబున నున్నది. మీరు దానిఁజిమ్మి వైచినగదా, వాలికన్న నెక్కుడు సత్వవంతుఁడవని నే నమ్మఁగలను.

రామ—చూతము రమ్ము. (నిష్క్ర.)

లోపల-ధ్వని-మరల ప్రవేశము.

లక్ష్మ—సుగ్రీవా! రాముని శౌర్యంబుఁ జూచితివా? ఆ కళేబరంబొక యోజనంబే వాలి కాలంబొటనజిమ్మె. నేడు భూపాలుఁడు పాదాంగుష్ఠమునఁజిమ్మఁ బడి యోజనంబులు దూరంబునఁబడెను. వాలికన్న సత్వవంతుఁడనినీవిప్పుడైన నెఱింగితి.

సుగ్రీ—సుమిత్రానందనా! ఆనాడాకళేబరము రక్త మాంసంబులచే నిండి బ్రువ్వైయుండెను. నేఁడు శుష్కించి యున్నదికదా ఎంత దూరంబైన నేమి? అంతేల. ఈసప్త తాళంబు లొక బాణంబునఁ బడవైచిన వాలిం గూల్ప సమర్థుండని నమ్మఁగలను.

రామ—(చిఱునవ్వున) వానరోత్తమా! ఈతాళసప్తకంబన నెంత! క్షణంబునఁ జక్కడి నీమది సంశయంబుఁ దీర్చెద. (లక్ష్మణునిఁజూచి) తమ్ముఁడా! విల్లందుకొనుము. (విల్లుఁజేకొని రాముఁడు సప్త తాళంబులను ఖండించును.)

(సుగ్రీవుఁడు సంతసమున)

౩౦. అనుబంధము.

సుగ్రీ—శ్రీరామచంద్రా! నీ బాహుబలం బెఱుఁగక నేనాడిన వాక్యంబులు మన్నింపుఁడు. ఆ లోకకంటకుండగు రావణుఁడు నిక్కముగ నీచే నీల్గఁగలఁడు. చీలి నోటఁజిక్కిన రాచిలుక చందంబున, రావణుని చేఁబడి, సీతామహాదేవి శోకించుచు, శైల ప్రదేశమున మంత్రులతో నేనుండ, మమ్ముంగాంచి, తనచేలంబున మణిమయ కనక భూషణంబులఁగట్టి, మాముం దటఁ బడవైచి చనియె. సెలవొసఁగినఁ గొని తెచ్చెద.

రా—(ఆతురమున) అర్కతనూజా! ఆ తొడవులను శీఘ్రంబున దెప్పింపుము.

గ్రీ—(హనుమంతునిగాంచి) సమీరనందనా! ఆనాడు గిరిగహ్వరంబునఁ డాచిన,మండనంబులఁగొనిరమ్ము. (అట్లొకావింప రాముఁడు భూషణములనుఁగాంచి హాసీతా!యని మూర్ఛిల్లును.)

రా—(దుఃఖమున) హామాతా! సుగుణోపేతా! క్షితిజనపారిజాతా! లోకైకమాతా! భువనవిఖ్యాతా! భూజాతా! ఆమాయా మృగంబువలన నీకిట్టి యాపద సంభవించె? నీవెంతకాలం దలమంది, మమ్మెంతదూఱి,తుదకీతొడవులు సైతము భారమై యిటు పాఱవైచి యెల్లఁగితివో? అట్టి నీవిపద్దశదలఁచుకొలఁది నామనంబున భరింపరాని దురంత సంతాప మొదవుచున్నది.

సీ॥ జననిరో! మిథిలేశు జనకుని యింటను
మురిపెంపు పట్టివై పెరగలేదె?
తరుణిరో! దశరథ ధరణి పాలునకీవు
ప్రియమైన కోడలై వెలయలేదె?
రమణిరో! సుగుణాభిరాముని మోహంపు
పత్నివై చెలువార బరఁగలేదె?
సద్గుణ సంపత్తి సారంబు నీవయై
తులలేని కీర్తిచే మెలఁగలేదె?

గీ॥ ఎన్నలేనట్టి వైభవ మున్న నేమి
పుడమి సౌఖ్యంబు లెల్లను వెడలద్రోసి
పరగ కష్టంబు లెల్లనీ పాలె యనుచు
కమల భవుఁడిటు వ్రాసెగా కన్నతల్లి॥

(రాముఁడులేచి దుఃఖమునఁ దొడవులను జేపట్టి.)

31. అనుబంధము.

ఆకురంగలోచన నైచామయతోఁగూడి మిక్కిలి ప్రకాశమానమై శోభిల్లుచున్నట్టి, యీ భూషణములు, కుండలములు, యీ కనక మంజీరములు, సుదతి వ్రేళ్లను, నక్షత్రముల భాతి ప్రకాశించుచుండెడి యంగుళీయకములు, మణిహారములు, యిపుడు కాంతిహీనమై యున్నవికదా? నాతనువునఁ బ్రాణంబులుండ, నీతనువునఁ బ్రాణంబులుండ నీవు జెఱబోయి నందులకు, నేనెంతని, దుఃఖింతును.

(పయఁట కొంగునుఁ జేపట్టి.)

సీ॥ పన్నీట సీత నాపదములు కడుఁగంగఁ
దడియొత్తు చేలమై తనర లేదె
సురత కేళినిఁగూడి సొలసిన వేళల
సురటియై చెలువారబరగ లే-
ఏకాంతమందున చేనాడు పలుకుల
కలిగిన తల్పమై వెలయ లే
అలసూర్య రశ్మికి నలసట గాకుండఁ
జెలి కాతపత్రమై చెలగ లే

గీ॥ అట్టి సహకారి వైనను నలిననేత్ర
నిన్ను విడనాడెగా? మది నిలుప లేక
చింత చేగుంది కడునోసి చిక్కువడుచు
నన్ను బాసిన కతమున నవనితనయ.

(యోచించి-కోపమున) సుగ్రీవా! ఆ రాక్షసనాథముఖమును జాన
గొని యేదిక్కునకు నేగెనో తెలుపుము. ఈక్షణమున వానిఁదును
మాడెదను. తెలుపుము. ముందు తెలుపుము.

32. అనుబంధము.

గ్రీ—దేవా! సర్వజ్ఞుండవు. మీకు నే దెలుపువాఁడనా? మున్నా
జానకీదేవి యెందున్నదో కనుగొని, యావల మీకీర్తి యా
చంద్రార్కముగా వెలయునటుల, రావణునిం బరిమార్చు
టకు కడఁగుదము. శాంత, ధీర, సుగుణోపేతుఁడవై, యిట్లా
గ్రహ మొందఁదగదు. నాప్రార్థనఁగైకొని శాంతివహింపుఁడు.

మ—వనచర శేఖరా! నీ హితవాక్యంబులకుఁ గడు సంతసించితిని.
మనమెవ్విధంబున భూపుత్రి జాడ నరయనగును? లోకకంట
కుండైన రావణుని నిర్జింప నెయ్యది యుపాయము?

గ్రీ—రామచంద్రా! ముల్లోకంబు లువ్వెత్తుగవచ్చినను సరకు
గొనని సత్వముగల మీరు దుఃఖభరంబుచే నిగుఱు గప్పిన
నిప్పు చదంబునఁ దెలియకున్నారు. ఇఁక నాబలంబు నే జెప్ప
జాల. మీకు నేఁడోడ్పుకుట కరువలి కగ్ని సహాయంబగు నట్లు
కాదే? అట్టి రావణు లెందరైన నేమి? నిరాటంకముగ బంధు
మిత్రామాత్యులతోఁడ భస్మంబు గావింపఁగలము.

రాము—భానునందనా! అటులయిన నింక దడవునర్పంబని లేదు.
ముందు నీకు కిష్కింధ రాజ్య పట్టాభిషేక మొనర్చెద. ఆవల
సీతాన్వేషణంబునకుఁ దగు ప్రయత్నము సేయుదము. నీవి
ప్పుడే వాలితో సమర మొనర్పఁజనుము.

గ్రీ—మార్గాయాసంబున మీరధిక శ్రమను జెందియున్నవారు.
నేఁడీపర్వతంబున నివసింపుఁడు. ఎల్లి నేను వాలితో కోలా
హలంబున కరిగెద. (అవనిక పడును.)



పంచమాంకము-ప్రథమరంగము.



తరులచాటున రామ లక్ష్మణులు-బయలు ప్రదేశమున-వాలి సుగ్రీవులు.

వాలి—ఓరీ సుగ్రీవా! మున్ను నీవు సర్చినట్టి కార్యంబునకు నిన్ను దున్మాడఁజూచితిఁగాని, తప్పించుకొని పాఱిపోతివి. మరల సిగ్గులేక నన్ను గదసంబునకుఁ జీఱితివి. బ్రతుకఁ దలఁచితివేని వెడలిపొమ్ము. లేకున్న నేడు నీకాయువు తీఱినదే?

సుగ్రీ—ఇంద్రతనూజా! ఇంకనట్టి గర్వము జెందకుము. కాలము యొక్కతీరై యుండునా?

ఉ॥ ఎంతటి శౌర్యవంతు డగునేనియు గాలము కానివేళలం
దంతల గుందుచుండినను వాఁడిరిదప్పక వేచి శాత్రవుల్
బంతము పూని, యేమఱకఁ బట్టి వధించుగాదె? యోరి! నీ
వెంతటి వాఁడవైన భువిఁదీఱెను గాలము నమ్ము దుర్మతీ.॥

అదను దప్పిన వేళల నెంత శౌర్య వంతుఁడైనను సమరమొనర్ప జయప్రదుఁడు కానేరఁడు. నే నప్పుడు పాఱితనని విఱ్ఱవీగకుము. తప్పక నీశిరము నేడు ద్రక్కలించెద. బుద్ధి గలవాఁడవేని నా భార్యను, నర్ధ రాజ్యంబును నాకిచ్చిన, నిన్ను సంతరించెద. ఊరక చెడకుము.

వాలి—(కోపమున) ఓరీ! ఈ బలశౌర్యంబు లిన్నిదినంబు లెక్కడడఁగియుండెఁ? రజ్జు లాడకుము. ఇప్పుడు నాకాలము తీఱినదని వచ్చితివా? కాదు కాదు. నీకాలమే సమీపించినది. నీకారుమ సహిత మర్ధరాజ్యంబు నియ్యవలెగా? నీకు మిత్తికన్నియ నొసంగి కాలునిపురం బేల బంపెదను. సహోదరుఁడవైనందున నీయందు నెనరుబూని వచించెద వినుము. ఇంకిట నిల్వక నెందైనఁ బాఱిపొమ్ము. మసలితివేని బ్రతుక నీ తరంబుగాదు.

సుగ్రీ—ఓహో హో! వాలితో సమరమొనర్పఁ జాలక మాటలచే బెదరింపఁ జూచెదవా? ఇఁక నీయాటలు సాగవు. మగటిమి గలవాఁడవై తివేని పిఱుతివియక నిలువుము. ఇదె నాముష్టి ఘాతము; రుచిచూడుము. (అని పిడికిటఁ బొడుచును,)

33. అనుబంధము.

వాలి—ఓరీ, పాఱుఁబోతు! పిఱికి మార్చెదరమ్ము, (సుగ్రీవునిఁ దాకును.) ఇరువురు ద్వంద్వయుద్ధము చేయుచుండ,

రాముఁడు, లక్ష్మణునిఁగాంచి.)

రామ—తమ్ముఁడా వీరిలో వాలి యెవఁడో, సుగ్రీవుఁడెవఁడో తెలియకున్నదే? ఏమి సేయుదును.

లక్ష్మ—(ఒకనిఁజూపి) అన్నా! వీడే యింద్రసూనుఁడు?

రామ—బాణము విడుతునా?

లక్ష్మ—(ఆతురమున) వలదు. వలదు. వీఁడుఁ కాఁడు. వాఁడు వాలి గానుండనోపు. బాణము విడువకుము.

రామ—(బాణము సంధింపఁబోవ)

లక్ష్మ—తాళుము. తాళుము, వాఁడు కాఁడు వాలివీఁడు. వీఁడు కాఁడు వాఁడు.

రామ—(నవ్వుచు) సోదరా! సిలయిట్లు తొందరపాటు వడెదవు? వాలి సుగ్రీవు లిరువురు సమాన రూపమున నున్నవారు. నా బాణ మమోఘము. వాలి వీఁడని నిక్కముగ దెలియువఱకు బాణము విడువఁదగదు.

(వాలిచే నొచ్చి సుగ్రీవుఁడు పరువిడ)

వాలి—ఓరిపందా! అపుడు దాసపగిది పాఱిపోయెదవా? పోమ్ము నీవింకిటు రాకుము. (నిష్క్ర.)

సుగ్రీ—(రాముని గాంచి దుఃఖమున) రామా! ఇట్లా రానతిచ్చినటుల వాలితో సమరంబుం జేయ ముష్టి ఘాతంబులఁ జావమోది తుదకు కరుణచే నన్నువిడువ మరల మిమ్ముఁజూడగంటిని.

మీశౌర్య ప్రతాపంబులనమ్మి వాలితోఁ బోరఁ దొరకొంటిఁగాని యిట్టి కపట మానసుండవని తలచనైతిని. నేను జచ్చినమీఁద నా? వాలిని చంపఁబూనితివి.

రామ—కపికులాధిపా! కోపముడిగి నాపలుకులాలించుము.

క॥ " స్వరములు నురములు శిరములు
గరములుఁ బెందొడలు మెడలుఁ గన్నులు వెన్నుల్
సుసచిర పదములు రదములు
నిరువురకుంజూడ నొక్కయీడై యునికిన్ "॥

మీ యిరువురభేదంబుగ నొక్క యీడై యుండ, వాలిని నిర్దేశింప రానందున, బాణము విడువఁ బ్రమాదంబు వాటిల్లునని నే మూరకుంటిని. భయపడకుము. ఈసారి వాలితో యుద్ధమునకు వెళ్లుము. తప్పక వానిఁదెగటార్చి నీకు సంతసంబొనర్చెదను. (లక్ష్మణుని గాంచి) లక్ష్మణా! సుగ్రీవుని గుర్తింప వాని కంఠమున నేదైన నొక మాలనుంచుము. (లక్ష్మణుడట్లే చేయును.)

రామ—సుగ్రీవా! భీతిల్లకుము. పొమ్ము. (నిష్క్ర.)

పంచమాంకము—ద్వితీయరంగము.

(అంతఃపురము - తార—వాలి).

తార—నాథా! ఏమివాని సాహసము! పిమ్మట.

వాలి—అంత నాకు మహాకోపము రెట్టింప సుగ్రీవుని యురము నా ముష్టిచే వజ్ర నిపాతంబుమాడ్కి గ్రుద్దిన రక్తసిక్తాంగుడై ఋశ్యమూకంబునకు బరువిడె.

తార—అట్టివాఁడు యుద్ధమున కేలవచ్చె?

వాలి—ఆశా పిశాచం బావేశం బగుటచే.

తార—నాథా! సహోదరునితో మీకట్టి దీర్ఘ విరోధం బేల? నాఁడే తప్పు జేసితిని మన్నించుమని వేడఁడా? రాజ్యమును మీకే యొసఁగి మిమ్మెంత ప్రార్థించెను. మీరిట్లాతని బారఁద్రోయుచితంబు కాదు.

వాలి—కపట మానసంబున నా రాజ్యంబుఁ జేకొని నపుడే వానిఁ గుదముట్టింప వలసియుండెను. సోదర భావంబునఁ బ్రాణ ములను దీయక విడుచుటే నే వానికొనర్చిన మహాపకా రము కాదా? (సుగ్రీవుఁడు ద్వారంబున సింహనాద మొనర్ప వాలి మహాక్రోధంబునఁ బోవ తార శీఘ్రంబున లేచి యడ్డగించి)

తార—ప్రాణేశ్వరా! నా విన్నపమాలకింపుము. ఇంతకుమున్ను మీతో గయ్యంబొనర్చి పాఱిపోయిన వాఁడు మరలతానై వచ్చుట నా కాశ్చర్యముగ నున్నది. మిమ్ముల నిర్జింప సమ ర్థుండైన బలశాలి వానికి దోడై యుండనోపు. లేకున్న ప్రాణాస్పదుండై పాఱిపోయిన వాఁడింతలో రా గలఁడా? కోపముడుగుఁడు. నీమనంబున నాలోచింపుము. వానితో యుద్ధము మానుము. నాథా! చెప్ప మఱచితిని. ప్రభాతం బున క్రీడాసక్తుఁడై యరిగిన యుంగదునిచే నేనొక వార్త వింటిని

వాలి—ఏమని వింటివి?

తార—దశరథ నందనుఁడగు రామచంద్రుఁడు, తండ్రి పనుపున త మ్మునితో వనవాస మేతెంచి, యనేక రాక్షసులను జంపి, పంచవటిఁ జేరియుండ, రావణుం డామునుజేశ్వరుని భార్యను గొంపోయెనట. అంత రాముఁడు సీతను వెతకుచు, ఋశ్య మూకంబున కొచ్చి సుగ్రీవునితో సఖ్యంబొనర్చి, వానికి సహాయంబుగవచ్చి, నిను జంపి, కిష్కింధ రాజ్యంబాతనికివ్వ సమకట్టి యున్నవాఁడట. రాముఁడాది విష్ణువు. అతనిఁ గెల్వ బ్రహ్మాదులకైన నసాధ్యము. అట్టి మహానుభావుని ప్రా పొందిన సుగ్రీవుని గెలువ నీ తరమా?

సీ॥ " మన యింటఁగల సర్వమణి ధనంబులుగొంచుఁ
గాకుత్స్థుఁగాన సంగదునిఁ బుచ్చి

యారాముతో సంధి యతిభక్తిఁ గావించి
కొని నిర్భయంబున మనుటమేలు
కాదేనిఁ గిష్కింధ కడువేగమునడించి
ఘనదూర దేశంబు చనుటలెస్స
యొండేని రఘురాము నొద్దకుఁ బ్రాణముల్
పోషించికొన నీవుపొమ్ముబుద్ధి
గీ॥ నీవు దనపాలి కేఁగిన నృపతి నిన్ను
నాదరంబున మన్నించు మోద మెసఁగఁ
జేయు నీ కుపకారంబు సేయుడాఘు
నుండు శరణార్థి జన రక్షకుండు గాన॥"

వాలి—వీరపత్నివైన నీకిట్టి భీతియేల? ఆరాఘవునకు నే నేయప రాధమొనర్చినాఁడ? నన్నేల జంప నుద్యోగించును? పగతుఁడు వచ్చి సమరంబునకు బిల్వ నింటఁ డాగియుండుట మగపాడియా? ఊరక దిగులొందకుము. ధైర్యంబున నుండుము. తప్పక నే నీసారి వానిఁజంపినిను శీఘ్రముగ వచ్చెద.

తార—(పోబోవనడ్డగించి) 34. అనుబంధము.

ప్రాణేశ్వరా! ఈచలము నేడు వలవదు. నాపలుకులాదరించుము

వాలి—ఇప్పట్టున వారింపరాకుము. పొమ్ము. (అతివడి నిష్క్ర.).

అంగ—(ప్రవేశము) అమ్మా! అమ్మా! చూడుము. నేను బాలురతో నాటలాడుచుండ నీలుఁడువచ్చి నన్ను గొట్టినాఁడు. (వీపు చూపును.)

తార—(వీపునిమిరి ముద్దాడి) నాచిన్నియన్నా! నిన్నేలవాడుకొట్టె?

అంగ—ఊరకనె. మేము బంతులాడుచుండ వాడడ్డమువచ్చెను. బంతివానికిఁ దగుల నన్నుగొట్టి పఱిఁగెడినాడు.

తార—పోనిమ్ము. వాడతిదుష్టుఁడు. వానితో నాటలకుఁబోకుము.

అంగ—అమ్మా! అయ్యయెక్కడ?

తార—మన సగతుఁడైన రవిసుతుఁను యుద్ధమునకు జేఱి వానిని సంహరింప జనెను. ఇంతలో నేవచ్చును.

అంగ—నాతండ్రి యూరకుండినను నేను నా పినతండ్రి రాజపుత్రు లసహాయంబున యుద్ధమునను వచ్చునని నేను జెప్పితినికదా! వారొక్కొక్కరు మూడు లోకంబులఁ గెలువ జాలుదురు. అయ్యో! నేడేల నాతండ్రి యుద్ధమునకు బోవలయు.

తార—నాయనా! నే నెంత జెప్పిన వినకయ్యె. తనచే మున్ను మర్దింప బడి పాఱిపోయినట్టి పంద పోరునకుబిల్వ నెటుల యోర్చి యుండ నగునని తామసంబునఁ జనియె. నేనేమి సేయుదు?

అంగ—అటుకానిమ్ము. ఆఁగి మాయయ్యం గోడితెచ్చెద.

తార—(అడ్డగించి) నాముద్దుపుత్రా! తండ్రియెడనీకెంత ప్రీతి? వల దన్నా! అటుపోవలదు. వెళ్ళిన మీయయ్య దండించును. నీ వాకలిగొని యున్నవాడవు. భుజింతువురమ్ము. (యెత్తి కొనబోవ).

అంగ—(అలుకచే) ఊఁ! హూఁ!

తార—పాయస మారగింతువు రమ్ము.

అంగ—ఊఁ! నాకేమివలదు పో.

తార—మఱియేమి కావలయు?

అంగ—అనఁటిపండ్లు.

తార—ఇచ్చెదరమ్ము. (యెత్తికొనబోవ పాఱిపోవును.)

అంగ—ఇపుడేయిప్పుడును వచ్చెద.

తార—ఇచ్చెదగాని యొకచిన్న పాటబాడుము.

అంగ—ఎవనిఁగూర్చి

తార—మనలను గాపాడు భగవంతునిఁ గూరిచి.

అంగ—(ఎగురుచుఁ బాడును.) 35. అనుబంధము.

తార బాలునిముద్దుకొని లోపలికిఁబిలుచుకబోవును. అవనికపడును.)

## పంచమాంకము—తృతీయరంగము.

---

(తెరుల మఱుఁగున రామలక్ష్మణులు. బయలుప్రదేశము. సింహనాదము లొనర్చుచు వాలి సుగ్రీవుల ప్రవేశము.

36. అనుబంధము.

వాలి—ఓరీవనచరాధమా! సమర మొనర్పఁజాలక పాఱిపోయి సిగ్గులేక మరలవచ్చితివా! ఇఁక నిన్ను విడువను. మదీయముష్టిఘాతంబులచే భూతలంబునఁ బడవైచి ప్రాణంబులను దీరమ్ము.

సుగ్రీ—భ్రాతృ శాపంబున నే నిన్నాళ్లు పూజ్యుండవని సైరించితిని ఇప్పుడు ధృఢ సంకల్పంబున వచ్చినవాఁడను. నేఁడు యుద్ధంబున నిన్నుఁజంపుటొండె, లేదేని నేఁజచ్చుటొండె, వేఱొండు లేదు రమ్ము.

వాలి— సీ॥ పేరడవిలోనుండు బెబ్బులిఁ గనుగొని
దారుస వృషభంబు తాఁకు—
మిగుల నాకలి గొన్న మృగ రాజు నెదరించి
దాకున నేనుఁగు తాఁకు—
సాహస మొప్పంగ శైలంబు కడకేగి
జారున నేడిక తాకున—
మత్సరించుచునుండు మార్జాలమును గాంచి
దాకున నాఖువు తాకుసటు
గీ॥ ఎందు జాగిన విడువక నేడు నీదు
అసువులను దీసి పంపెద యమునికడకు
నన్నుఁ జెనకుచు నీవింక నవని మీదఁ
బ్రతికి యుండంగ నెయ్యది ప్రాపు చెపుమా?

దుర్మతీ! ఇంకెందు బోయెదవు. (అనిముష్టిఘాతంబివ్వఁబోవ తప్పించుకొను)

సుగ్రీ--ఓరీ వాచాటుఁడా! ఇప్పుడైన నా యీతుదమాటవినుము. నేడదిగ నన్ను నీతో సమానునిగ భావించిగౌరవింపకున్న నిక్కంబుగ నిన్ను యమపట్టణంబున కనిపెద.

వాలి--ఓరీవందా! కాల హారణంబేల చేసెదవు? పోటుబంటువేని వేగంబెరమ్ము. లేకున్న మునుపటియట్లు పాఱిపొమ్ము.

సుగ్రీ--ఔరా! చేటొదవునని నే నెంతజెప్పినను మీఱివచ్చెదవా? రమ్ము. (ఇరువురు యుద్ధము చేయుచుండ రామలక్ష్మణులు తమలో.)

-మ--తమ్ముఁడా! వారిసంగ్రామంబుఁజూడ నాకాశ్చర్యముగనున్నది. సుగ్రీవుఁడు చాలా బడలియున్నవాఁడు.

లక్ష్మ--అన్నా! వాలి సామర్థ్యంబపారంబుగ నున్నది. ఇట్టివాని కడ నా? సూర్యనూనుఁడు నిలుచుట. కాలవిలంబమైన సుగ్రీవున కాపద సంభవించును. బాణము విడుచుటకిదియె సమయము.

-మ—(బాణము విడువ వాలి పడిపోవును.)

(రామలక్ష్మణులు యెదుట నిలువ)

వాలి—(కోపమున) రామా! ఒకరునితో యుద్ధ మొనర్చుచున్న నన్నేమఱించి శరము వేయఁదగునా? వీరుడవైన నన్నెదు ర్కొని సమర మొనర్ప వలయుఁగాని చోరుఁడవై తరుల మఱుగునడాగి, కపిరాజని యెంచక, పాపమని తలంచక, హే యమని యోచించక, నిట్టి నీచ కృత్యంబునకు బాలుపడిన నీవుక క్షత్రియుఁడవేనా? కావు నీచుఁడవు, పాతకుఁడవు, మోసకాడవు. నే నించుకైన నీ కపకార మొనర్చియుంటినా? అన్నదమ్ముల కలహము లెన్నిదినంబు లుండుననని యెంచితివి? నే బ్రతికియున్న సుగ్రీవునకు రాజ్యంబు రానేరదని నీవిట్టి కప టోపాయంబు నాలోచించితివా? సత్యసంధుఁడగు దశరథ రాజుకీర్తి నీఁ జెఱచ జనించితివి. శమదమాది సద్గుణంబులచే జెంపువహించిన రఘువంశమునకున్ కలంకము దెచ్చితివి.

రాజైనవాఁడు మనుజుల తప్పులరసి శిక్షించునుగాని నీవు నిరపరాధులను జంపునా? ఇంతకు నేఁడు భరతుఁడుండ నీ సాహస కృత్యంబున కేలపూనితివి? నరులు వానర మాంస మెందైన భక్షింతురా? తుదకు వాని శరీరంబైన స్పృశింతురా? నన్నేల నిష్కారణంబుగ జంపబూనితివి?

కం॥ "ధరణిజఁజెఱవట్టినని
ర్జరరిపుఁడగు రావణుఁడనె రాజ్యముగొని నీ
బురివెడలఁగఁద్రోయించిన
భరతుండనె నీవు నన్నుఁ బగగొని చంపన్."

రామా! నీసతిని రావణుం డెత్తికొని పోయినవార్త నా కుమున్నె తెలిపియుండిన నేనొకక్షణంబున నీదేవిం దెచ్చి నీకొప్ప చియుండనా? మున్ను రావణుని నావాలంబున బంధించి సప్త సము ద్రంబులందు ముంచి కరుణచే విడిచిన వాఁడను గానా? నాఘన బా హుశక్తి లోకవిదితంబై యుండ నివిట్లేల కావించితివి?

రామ—ఆహా హా! ఇంద్రనందనా! నీతప్పు నీవెఱుంగక ధర్మాధ
బుల నుడువుచున్నావు? చపలుఁడవై తమ్ముని భార్య
గ్రహించి నిష్కారణంబుగ వానిఁబురంబెడల ద్రోయుట ధ
ర్మమని తలఁచితివా? నే రాజును గాననియు, దండింప న
ర్హుఁడనియు నెంచితివా? భరతుని పంపున నే ధర్మాత్ముల
గాపాడను, ధర్మహీనులను శిక్షించను, వచ్చినవాఁడ. నే
నేమఱుఁగుననుండి మోసగించి బాణము వేసితననియా
షించుట?

సీ॥ "మృగయయందు మృగముల నొగిఁబొంచి వేసఁజంపుఁ
గానరుండఁగ జంపుఁగడఁక
విముఖంబులైయుండ వేచంపు మఱిసమ్ము
ఖంబున నుండఁగ నడఁగి

వలఁబోను లాదిగాఁ బలు యంత్రములఁ జంపు
వడిమీఱు శునకాలి విడిచిచంపు
మఱియొక్క మృగముతో మలసిపోఁగ జంపు
దీమంబునకుఁ జేర్చి తెగువఁ జంపు.
గీ॥ నెన్ని భంగుల నయిన మాంసేచ్ఛ మృగము
నరులు చంపఁ దరిలె దాన దురిత మొంద
రఖిల ధర్మార్థ కోవిదులైన రాజ
వరులు మృగయాభిరతులైన వారు కారె॥ ”

కావున శాఖామృగమగు నిన్నుఁ జంప దోషంబు లేదు. ప్రజలొనర్చునట్టి పాపంబులు రాజులఁ జెందును. రాజైనవాఁడు తప్పక దుష్టులను దండించవలయును. సాధ్వీమణియు, ననుజన్ముని ప్రియపత్నియునైన రుమను బొందిన పాపమే నిన్నిటొనర్చెను. నాచే శిక్షితుఁడవైన నీవు సర్వపాప విముక్తుఁడవై స్వర్గ సుఖంబు లనుభవింప గలవు.

వాలి—శ్రీరామచంద్రా! బాణవేదనకు సహింపఁజాలక నేనాడిన పలుకులకు కోపమొందక మన్నింపుఁడు.

తార—(ప్రవేశము—రోదనముతో) హా ప్రాణేశ్వరా! మేరుపర్వత ధైర్యుండవు. క్రూర గంధర్వపతియగు కోలంబునిఁ గూల్చిన సత్వసంపన్నుండవు. కులశైలంబుల నుక్కడంచిన బలారాతికి పుత్రుండవు. ఇట్టి వాడవయ్యు నొక్క మానవునిచే గూలితివే?......రాముఁడాదిదేవుఁడు, సామాన్య నరుఁడుగాడని నే నెంత వారించినను వినవైతివి.

సీ॥ "అంగదుఁ జేపట్టి నధిపసుగ్రీవుఁడు
కాకుత్థ్సు శరణంబు గనియెనంటి
రాము ప్రాపున నిన్ను రవిజుఁడాజికిఁ బిల్వ
వచ్చినవాఁడు పో వలవదంటి

నారాముతో సంధి యొలపడఁ గావించి
భయమేది నెమ్మది బ్రదుకుమంటి
రాముఁడు నీచేత రణమునఁ జిక్కఁడు
శక్రముఖ్యులకునసాధ్యుఁడంటి।
గీ॥ మనఁగ నాబుద్ధి వినక నా మన్ని గొంటి
వింక నీశోక వారాశి నెట్లు గడతు
దిక్కుమాలితి నింక నేదిక్కు సొత్తుఁ
గుటిల దైవంబు నిన్నుఁ ద్రొక్కొనియె నకట॥ "

హా నాథా! కార్యంబునకుఁ బోవలవదని నే నెన్ని విధంబుల మొఱబెట్టినను నాపలుకు లాదరించక నిష్కారణంబుగ రామునిచే గూలితివి కదా? ఇంక నాకెవరు దిక్కు? నీవు లేనట్టి యీలోకంబు నాకేల?

వాలి—ప్రాణేశ్వరీ! ఎంతనీవు కడుపు పగులనేడ్చినను, ఫలమేమి రాగలదు? నేటికి నాకును మీకును ఋణముతీఱినది. "కంచియే చేనుమేసినఁగలదె కాపు" అనినట్లుగ జగద్రక్షకుండైన రామచంద్రుఁడే మనపైఁ జలముపట్టిన మనకష్టంబులందీర్చు వేలుపు వేఱొకఁడు గలడా? శోకంబు విడువుము. ధైర్యంబుఁబూనుము. నాయందలి ప్రేమ దిగనాడి కౌమారరత్నమంగదుని పోషింపుము. నాకై వాఁడు శోకింపుచుండ నట్టి తఱి దిట్టతనము వహించి నీవు యోదార్పకున్న వానిగతి యేమి? ప్రియా! వలదు వలదు. ఈదుఃఖము వలదు,

37. అనుబంధము.

తార—నాథా! ఈశోకవారాశి నే నెట్లు దాటఁగలను. ఎవరినిఁజూచి మనగలను. నాకెట్లు సంతసంబొదవగలదు. నిన్నుఁ గాంచని క్షణము నాకు వత్సరంబై యుండు. ఇఁక నేనీచిరకాలవియోగ మెట్లు సహింపఁగలను? మనోహరా! నీ వెంటనే నాకంబునకు వచ్చుదాన. నిక్కముగ నినుబాసి యుండఁజాల.

వాలి—నావియోగమునకే దుఃఖించుచున్నట్టి యంగదుఁడు నీవుసు లేకున్న నాఁడెట్లు తాళఁగలఁడు? వానిని రేయుదవులంద్రో చెదవు? అబలా! ఇట్టిసాహస మొనర్పకుము. సుగ్రీవుండుండ నీకేకొఱంతయుఁ గలుగదు.

అంగ—(రోదనముతో ప్రవేశము) హాతండ్రీ! మహాధీరుఁడవైన నీ కిట్టి యాపద సంభవించునని కలలోనైన దలఁచనైతిగా? నిం దుపీఠోలగమందున్నను నన్నుఁ గాంచిన మితిలేని సంతోషం బున జేరఁదీసి దీవించి లాలించుచుంటివే? అయ్యో! జనకా! కయ్యమునకేగ వలవదని నాజనని యెంత వచించినను వినక తుదకిట రామునిచే గూలితివికదా? ఇంకమాకెవరుదిక్కు?

వాలి—(అంగదునిఁ జేరదీసి) అంగదా! సర్వాంగసుందరా! ఏలదుఃఖం చెదవు? నాపురాకృతఫల మిట్లుండ నెవరేమి సేయఁగలరు. నాకన్న నెక్కుడుగ నిన్ను సుగ్రీవుఁడు ప్రేమించి పోషింప గలఁడు. తనయా! నాకన్నులపండువుగ నీకు రాజ్యాభిషేక మొనర్చు భాగ్యమునాకు లభింపనందుకు దుఃఖంచెదను.

తార—(సుగ్రీవునిగాంచి) అర్కతనూజా! నీవ్వెంటిమై పోరఁజాలక శ్రీరామునిచే, నా నాథుని భూతలంబున సాధించి వంచనచే రాజ్యమునుఁ జేకొంటివికదా. ఇఁక నీపత్నిఁగూడి యాచం ద్రార్కముగా నేలుము. (రామునిగాంచి) రామా! నీవంటి క్షత్రియ వీరుఁడు క్రూరమృగంబుల వేటాడుదుగాని వనఫలం బులనుదిని యొవరికి బాధలేకుండ సంచరించు శాఖామృగం బులను జంపుదా? నాపతి నీ కేమపకార మొనర్చె? అన్నదమ్ముల పోరాటంబున నీవేల ప్రవేశించితివి? కరుణా త్ముఁడవని వింటిని కాని కఠిన మానసుండవని నే నెఱుఁగ నైతి. స్త్రీహంతకుఁడవు. కరుణ నీయందుగలదా? నిష్కా రణంబుగ నాపతినిజంపి భర్తృవియోగంబు గావించితివి. కాన సీతను గొనివచ్చినను చిరకాలము నీకతనుం తకభూమిం బొచ్చుగాక.నాయట్లనీవు ను సతివియోగంబునశోకింతువుగాక.

వాలి—రామా! దుఃఖాకులతనొంది తార నుడివిన పలుకులకా గ్రహింపకుడు. కరుణించి యీతారాంగదులను గావుడుము. అంగదునకు యువరాజ్య పట్టాభిషేక మొనర్చి రక్షించు భారము మీదై యున్నది. బలశౌర్యంబుల వాడు నాకు సమానుడు. మీ కార్యంబులు సాధింప సమర్థుడు.

38. అనుబంధము.

రామ—ఇంద్రనందనా! నీయభీష్టంబుదీర్చెదను. సందేహంబువలవదు

వాలి—(సుగ్రీవునిజూచి) తమ్ముడా! నే జేసినట్టి యపరాధంబులను నీ మనంబున నుంచకుము. క్షమసాధ్వీమణి సుచరితచారిత్ర సుషేణునిపుత్రిక, తార నాదరించి ప్రోవుము. సుకుమారుడీ యంగదుని రక్షింపుము.

శా॥ "ఈతారా పుత్రుడైన యంగదు సుఖాన్వితాత్ముగా నీకక్షి-
క్షితిం బెంచితి నింతకాలము కనుబెంపొందు ప్రాణప్రియుం
డీతం డెంతయు నాకు నర్కసుత నీవీపట్టి నా మాటుగాం
జేతో దుఃఖము వాయ గారవమునం జేపట్టి రక్షింపుమీ."

(రామునితో) జానకీనాథా! మీకరుణా కటాక్షంబున నిష్కండనై, వైకుంఠ ధామంబున కేగగంటిని. ఇంక నాశరీరంబు ప్రాణంబులు నిలుపజాలవు. రామా! రవికులాంబుధిసోమా! తారకనామా! యోగీశ్వరులయినను మీదివ్య నామ ప్రభావంబు గనజాలరు. నేనంతటివాడ? వేదవేద్యుడవైన నీసుందరవిగ్రహము ప్రాణావసానమునందున్నార వీక్షింపగంటిని. నాపూర్వపుణ్య ఫలంబేమని నుడువువాడ. జానకీరామ! శ్రీరామ! వైకుంఠధామా! రామ! (అని ప్రాణములు విడుచును.)

తార-అంగదుడు-సుగ్రీవుడు-వాలిపైబడి దుఃఖమున.

39. అనుబంధము.

తార— సీ॥ కపికులాధీశ్వర! కపిరాజశేఖర!
కన్నెత్తినాదిక్కు కాంచవేమి?
హృదయేశ! నినుబాసి యేనుండ జాలను
నీవెంటనే తెంతు, నిక్కముగను
ఏలయీ చుట్టాలు యేలయీ పుత్రుండు
యేలయీధనధాన్యమేలనాకు?
హానాథ! హావీర! హాయింద్రనందన!
హాజీవితేశ! హావనచరేంద్ర!

గీ॥ ధర్మపత్నినిఁ గడద్రోచి ధరణి మీద
నాథ! న్యాయమే చనఁగ యనాథ జేసి
యెన్ని విధముల చెప్పిన నెమ్మితోడ
వినఁగ నైతివిగా నాదుమనవి యకట!

హా! ప్రాణేశ్వరా! అకాల మృత్యువునకు లోనాదువని నే గలలోనైన నెఱుఁగనైతిగా. నీసత్వంబునకు మెచ్చికదా సకల సౌఖ్యంబు లందుకొని మజ్జనకుఁడు నన్ను నీకు దారఁబోసె. నా నోము ఫల మిట్లుండ నీవేమిసేయఁగలవు. హాదైవమా! ఇంక నాకీనిరర్థకపు జీవనంబేల? నాపతితోడి లోకంబు నాకును గలుగఁజేయుము.

అంగ— సీ॥ బాలుడ రమ్మని లాలించు తండ్రివి
పిలిచిన నిపుడేల పలుకవయ్యా?
నాకూర్మి తనయుఁడ నాచిన్ని సుతుఁడని
ప్రేమతో నిపుడేల పిలువవయ్యా?
అంకమందునఁ జేర్చి యాడించు తండ్రివి
కన్నెత్తి యిపుడేల కాంచవయ్యా?
మూర్థంబు మూర్కొని ముదమొందు తండ్రివి
చెంతకు నిపుడేల చేర్చవయ్యా?

గీ॥ అట్టి లాలనం బాకరుణా రసంబు
నీకు లేదాయెగా తండ్రి నేఁడుచూడ
దప్పు నేనేమి చేసితి చెప్పరాదె
ఇటుల నుండగదగునయ్య? యింద్ర తనయ!

హా తండ్రీ! నేనెంత పరితపించినను గన్నెత్తి చూడక నొక్క మాటైనఁ జెప్పకున్నాఁడవే? ఇఁక నన్నెవరు సంరక్షించువారు? మమ్మోదార్చువారు? అకటా! నన్నీధరణిపైఁ దండ్రిలేని బిడ్డను జేసి పోవ న్యాయమా?

సుగ్రీ—అక్కటా! అగ్రజా! నాక్షేమంబరయక, గర్వాతిశయంబున నన్వెడలఁద్రోచి యిట్టి యాపద నొందితివికదా? ఇన్నివత్సరములు నే బడినట్టి యిడుములు సైరించితిఁగాని మహాబలశాలివగు నీ నిర్యాణంబిప్పుడు వహ్నిచేఁదరికొను వృక్షంబు చందంబున నాధైర్యస్థైర్యంబులను క్షీణింప జేయుచున్నదే? అయ్యో! యింక నే నెట్లు భరింతు? హా దైవమా నే నేమి సేయుదు.

లక్ష్మ—అర్కతనూజా! మూఢుని చందంబున నీవిట్లుల శోకించెదవు? తామొనర్చిన పాపపుణ్యంబులే, ప్రాణికోటికి సుఖదుఃఖంబులకు గారణంబులై యుండును. చంపువారెవరు? చచ్చువారెవరు? మమతచే దేహాభిమానంబున విలపించుటె కాని వేఱొండులేదు. ధైర్యముఁబూని కాగలకార్యంబున కుపక్రమింపుము. దుఃఖము వీడుము.

అంగ—(తారకడఁజేరి) సీ॥ అమ్మరో! యెవరింక నరసి ప్రోచెదువారు?
దైవమే మనపట్ల దాయయయ్యె

తార— మనపూర్వ కర్మంబు మనకిట్టు లుండంగ
దైవము దూఱంగ దగదుతనయ

అంగ— తల్లిరో! యేసెట్లు తండ్రిని యెడబాసి?
నెమ్మదినుందునో యమ్మ చెపుమ

తార— నాయన్న నీవిట్లు యడలుచు నుండంగ
నేజూడజాలనో యింద్రపౌత్ర!

తార— గీ॥ తనయ! పోయెద సంకసీ తండ్రివెంట
మాతయందుంను మనుతనుమానుమన్న

అంగ—(కౌఁగిలించుకొని) అమ్మ నిన్నడబాసి నే నవనియందు
నెటుల చరియింతు నాకిఁక నెవరు దిక్కు.

హను—అమ్మా! యీబాలుని భీతిల్లఁజేసెద వేల? నీయట్టి సుచరిత్రకు నే జెప్పవలయునా? వీరస్వర్గము నొందిన వాలికై మీ రింతశోకించనేల? దైవ సంకల్పమునకు మాఱుకలదే? లెమ్ము. ఈ బాలుని యోదార్పుము. దుఃఖమును విడనాడుము. సుగ్రీవుని కటాక్షించి మమ్ముఁగా పాడుము.

సుగ్రీ—(అంగదుని కౌఁగిటఁజేర్చి) తనయా! వగవకుము. నే నీకు సకల సౌఖ్యంబు లందజేసెదను. ఊఱడిల్లుము.

రామ—అంజనాపుత్రా! యీ వాలికి దహనాది కృత్యముల నెఱవేర్పుటకుఁదగిన యేర్పాటు గావింపుము.

హను—శ్రీరామచంద్రా! తగుప్రయత్న మంతయుఁజేసినాఁడ. కపివరులెల్లరు వలసిన వస్తుచయుం బొనగూర్చి మీ యానతికి వేచియున్నవారు.

రామ—(సుగ్రీవునితో) సుగ్రీవా! ఇఁక నాలసించక, వాలిం గొంపోయి దహనాదికృత్యంబులను జరిపి తిలోదక విధానంబు లాచరించి, పరిశుద్ధిఁబొంది, వేగంబె నా చెంతకురమ్ము.

సుగ్రీ—చిత్తము. (రామ లక్ష్మణులు ముందుకు రాగ వెనుక తెర పడును.)

రామ—(లక్ష్మణునిగాంచి) తమ్ముఁడా! ఇఁక సుగ్రీవుని సహాయం బున మన కార్యంబవశ్యముగ నెఱవేఱఁగలదు.

లక్ష్మ—అన్నా! నిరాటంకముగ మనమింక రావణాది రాక్షసుల నవలీల జయించి, సీతాదేవిని తప్పక సాధింపఁగలము. పావ కునకుఁ బవమానుని తోడ్పాటాదవినమాడ్కి- మనకీ మహా భుజబలోపేతుఁడగు సుగ్రీవుని సహాయంబబ్బినందున నింక గార్యసాధనమునకు సందియంబె లేదు.

(సుగ్రీవుఁడు-అంగదుఁడు-హనుమంతుఁడు ప్రవేశము.)

రామ—అర్క-తనూజా! ఇఁక నంగదుని, నీపుత్రునిగా నెంచుకొని, యేకొఱఁత లేకుండ గాపాడుము. తార మొదలగువారు శోకం బునొందకుండునటుల యరసితగురీతినదు చుకొనుము. ధర్మముఁ దప్పక రాజ్యమేలుము. పవనతనయా! మీరందఱు కిష్కింధకేఁ జని, సుగ్రీవునకు కపిరాజ్యపట్టంబుగట్టి, యంగదుని యువ రాజు గావింపుఁడు.

హను—దేవా! మీ కృపాకటాక్షంబున మాకిట్టి కల్యాణం బాద కా గాన కిష్కింధకు మీరరుగుదెంచి, కాగలకార్యంబులు నెర వేర్చి, మమ్ముల నానందాబ్ధియందుఁదేల్చ, మిక్కిలి ప్రార్థిం చుచున్నాఁడ.

రామ—కపికులోత్తమా! నీవాక్యములకు కడుంగడు సంతసించితిని. అయిన పదునాల్గు సంవత్సరము లరణ్యావాస దీక్ష వహించి యున్నాఁడ. నేపురంబునకు రాఁజాలను. నామారుగ సుమి త్రానందనునిఁదోడ్కొని పొండు. అతఁడన్ని కార్యంబులు నెఱవేర్పఁగలఁడు.

(లక్ష్మణునిగాంచి) లక్ష్మణా! వీరలందోడ్కొనిచని, సుగ్రీవాం గదులకు పట్టాభిషేకంబానర్చి రమ్ము.

లక్ష్మ — సుగ్రీవాంగదులారా! ఏల మోచించెదరు? మీకు నాయందు గల భక్తి నే నెఱుఁగుదు. నేరాని కొఱఁత మీమనంబున నుంచకుఁడు. లక్ష్మణ కుమారునిఁ దోడ్కొనిపొండు.

సుగ్రీవుఁడు — చిత్తము. (నిష్క్ర.)

పంచమాంకము — చతుర్థరంగము.

## పట్టాభిషేకము.

కిష్కింధ రాజధాని - లక్ష్మణుఁడు - సుగ్రీవుఁడు - అంగదుఁడు హనుమంతుఁడు మొదలగువారు.

సుగ్రీవాంగదులను సింహాసనాసీనులఁ గావించి.

లక్ష్మ — సుగ్రీవా! వాలి పరాక్రమంబునకు మెచ్చి దేవేంద్రుఁడు కాంచనమాల నాతనికిచ్చెను. ఆమాలను వాలి శ్రీరామున కొసఁగె. నీపట్టాభిషేక మహోత్సవకాలంబున నేను శ్రీరామచంద్రుని యానతిమేర కామాలను నీకు వేయుచున్నాఁడను. జయశీలుఁడవగుదువుగాక. (అనిమాలను కంఠమున వేయు.)

సుగ్రీ — దేవా! శ్రీరామచంద్రుని ప్రసాదంబుగ గ్రహించినాఁడ. (హనుమంతుఁడు పూలహార మంగదుని కంఠమున వేయును.)

మంగళము. 40. అనుబంధము.

—:(o):—

సమాప్తము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

# అనుబంధము.



### (1) సుమిత్ర-మోహనరాగము-ఆదితాళము.

రారా! నన్ను గావవర-భోగిశయనా! సరగుననీవిటు
రారావేగ-రాజీవాక్ష! నారదాది మౌనివంద్య! ॥పల్లవి॥
పరిపరివిధములఁ-బ్రార్థించెదనిఁక-శ్రీరమణీధవ! కావుము రా
సురవర సన్నుత! కృపజూడుమునన్-మతిమతివేడెద॥ 1.
నిన్నే నెరనమ్మితిర-వెన్నుఁడ నన్ గావుము-రా-
పన్నజన రక్షకనిఁక-వినుతించెద॥ 2.

### (2) లక్ష్మణుఁడు-ముఖారి-రూపకతాళము.

నేనేల? దవ్వరిగితి-నీయరణ్యమున నేఁడు ॥పల్లవి॥
క్రూరమతిని మానిఁజంపి-ఘోర పాతకుఁడై తినకటా
దోసమెట్లుపాపుకొందు?-కోసలేంద్రు నెట్లుకాంతు? 1.
మింటుఁదిరుగు ఖడ్గమేల-కంటఁబడఁగఁగొంటినయ్యో!
పొసగియున్న పాపమేమొ-వశముగాదు తెలియనాకు॥ 2.

### (3) శూర్పణఖ-బ్యాగ్-ఏకతాళము.

ఎంచిచూడఁగను-మంచిసమయమిదె-యోచింపఁగనేలా?
అనతికాల-మున నెనాదు-కోర్కె-లుకొనసాగ॥ ॥పల్లవి॥
మించినభక్తినా-తనయుఁడు వాసవు-మెప్పొవడసిచాల
వరముల-గొనుచుశత్రు-వర్గముదునుమాఁడు॥ 1.
శక్తిలేకనా-లంకను జేరి-రావణుదునుమాఁడ
సుతరంబుగను-రాజ-సూతను నేనాదు॥ 2.

### (4) హిందుస్థానికాపి-ఏకతాళము.

సీత—నాథా! అలుకయేలా-నాతో యింతలోన నా॥ ॥పల్లవి॥
రాము—కామ్మా! తొలఁగిపొమ్మా-వలదువలదీమాటలు॥ ॥పల్లవి॥

సీత—చాలునీవిటు-శేలనాడ? భూ-పాల వేడెద
పూలకొలికయి-కోపమేటికి-పాలనఁజేయుము॥ 1.
రామ.—మరులుమీఱి-విరులుగోసి-తరుణిముడవగా
కోరిరాగ-ని-రాకరించుట చేమి సరసము?॥ 1.
సీత—చరణముల-కెఱఁగి నేను-శరణు వేడెద
మారజనక-నా-నేరమెంచక-సగుగున నేలుము॥ 2.
రామ—డెందమలరా-నందముగ-యిందువదనరో!
పొందుగముచు-వంగరాగనె-వలదనిపలుకవె॥ 2.

(5) శూర్పణఖ-బ్యాగ్-అటతాళము.

నినుజూడనామది-ఘనమోహమును నొందెఁగాదె
సన్నుతాంగ!-మొన్న నేల? వన్నె కాడ!
నగముల-వనముల-నగటుల కై న-నినుగానియేగద
చాలగనాతోడి-సుఖలీలఁగూడక-వనవాసమేలర?
అకురూపినీ కేలా?-గుణవిహీనయదిచాలా-ఘనసుందరి
నేనుండగ ॥ని॥

(6) హిందుస్థానితోడి-ఆదితాళము.

శూర్ప—భావజా-సమసుందరా!-వేడెదర॥ ॥పల్లవి॥
లక్ష్మ—చానరో! చాలుపోపొమ్ము-కోరకుము॥ ॥పల్లవి॥
శూర్ప—ముదముగ నేనిను-మదిఁగోరినార
సదయుఁడ ననుగావుము-వీడకుము 1.
లక్ష్మ—మగువరో నీవు-మరియాద లేక
తగునటు ననుఁగోరను-జేరగను 1.
శూర్ప—మనసిజు బారికి-మనజాల నేను
మానవ నాథ నేనిను-మానసుర 2.
లక్ష్మ—స్వాంతంబున సీతా-కాంతునిమాని
కాంతరో! ననుగోరఁగ-వింత లేగ 2.

(6†) భైరవి-రూపకతాళము.

శూర్ప—మరుబారికి-యోర్వగనా-తరమా-రమణుఁడ ॥పల్లవి॥
రామ—పరనారుల-చేరను నే-వినుమా-తరుణిరో! ॥పల్లవి॥
శూర్ప—విరిశాణుని-శరములు వ్వాడి-తగిలెఁ నే-తాళజాల-రమణుఁడ
రామ—చాలా-మే-లా-నే-తరుణిరో! 1
శూర్ప—ఏరా-మేరా-రారా-మారా-కార-రమణుఁడ! 2
రామ—తగునే-మగువా-నగవా-ననుగో-రగను-తరుణిరో! 2
శూర్ప—జాగేలర-నీకౌఁగిలి-వేగంబున-నాకివ్వుము
నీకన్న నా-లోకంబున-వేరొక్క-ని-నేఁగోరను 3
రామ—చెలియరో నీ-చెలిమిని నే-వలవనునఁ
దలఁచకుమా-పలుమాటలు-పలుకకు-తరుణిరో! 3
శూర్ప—పరితాపము-భరియింపగ-భరమాయెను-మతి పేడద॥ 4

(7) హిందుస్థానితోడి-ఆదితాళము.

శూర్ప—మరుబాధకోర్వఁజాల-నీరజనయన నను-బిరాన నేలుము
రామ—పలుమాటలాడ నేల? బాలరో! నీవునా-భావముఁ దెలియ-
శూర్ప—మనమలర నే-నిను-గోరియొరుతలఁపగల నేమది నీ
మానవనాథ నను-మానక నేలుము 1
రామ—సుమశరునిఁ బోలుయా-సౌమిత్రిని జేరగ బామ్మా! కోమలి
సుదతిరో! నేను పర-సుదతుల కోరను 1

(8) శూర్పణఖ-హిందుస్థానితోడి-ఏకతాళము.

చాల్ చాలుర నా సామి-చాలించర-ఇఁక-
చల మేల చాలని న్ను వేడెదర
మరుబారికి-నేతాళజాలర-మారసుందర నిన్ని ఁక-వీడనుర
అక్కున జేర్చుచు - చెక్కిలినొక్కుచు - చక్కని సామియిఁక
నన్నేలర
కమ్రకూరుఁడై మారుఁడు నాయెదను - వడికరంబులతో
సాగెనురా ॥చా॥

రాము॥ నీరజాక్షీ! నీమాటకు-మాఱుపలుకువాఁడనె
పాఱినీకవెంటనంటి-బాల! తెత్తుక్షణములోనె॥ ప॥
త॥ కాని తెమ్మాహరిణంబును-మనసాయదీనిఁజూడగను
భానువంశతిలకనేను-కేలుమోడ్చివేఁడదాన॥ 1
లక్ష్మ॥ (15) కపటంబీహరిణంబు-గాంచరామ! నామదికి
జాడఁదెలియుఁ రుగగానె-చాలమోసమౌను గాదె॥ ప॥
రాము॥ కతమేమీగతిఁబలుకగ-మతిఁదోచదాయనాకు
సతులకోర్కెలఁదీర్చకున్న-పతులబ్రతుకురిత్తగాదె॥ క॥
లక్ష్మ॥ కలవేయాయిలనిట్టి-పలువింతమృగములా-హా! హా!
కలుగుననుచునైనవింటిమె-వలదు వలదీవాంఛ॥ 1

(16) రాముఁడు—కాంభోజి-త్రిపుటతాళము.

ఎక్కడిమృగమకటా! చిక్కకయున్నది
యిక్కపుమృగమైన - చిక్కులుకలుగునె ॥ప॥
శరమును విడువక - వెరవునబట్టుటకై
దిరుగుచు నున్న యీ - దొంకకయున్నదె 1
దినకరుఁడస్తాద్రి - దూరము నిలువగ
వనమున నాకడ - మురియుచునుండునె॥ 2

(17) సీత—నాటకురంజి-ఆదితాళము.

వేగమరుగుమా - అన్న - శ్రీరాముని (చేరనరుగుమా)
నాదుడెందమందు - కందుకలైచాల ॥ప॥
ఘోరకాననమున - క్రూరదానవులచే
పోరునందుజిక్కి - చీరఁగలైనేఁడు
అడవుసేయుఁజనదు - పుడమితేడకటా!
ఎటులనున్నవాఁడో! ఏమితోచదాయె॥

(18) లక్ష్మణుఁడు-హిందుస్థాని-జంఝూటి ఏకతాళము.

రాము॥ కాఱడవిలోన-నిట్టి ఏకన్యాఘోరముగను-మదిఁజూడ
ధర్మముగున

జననిరో! ఇంటిమెరయుటు-నిన్ను శాసిటు-చనగజాలనె॥ ప॥
ఈతీరున బలుకగ నేల?-మది దైన్య మొంద నేల?
తల్లిరో! కక్క-సంబున-రక్క సుండీటు-క్రుక్కి-యాజివగనె॥ 1

(19) రావణుండు—సారంగము—రూపకతాళము.

కంటినిందుసుందరాంగిని-కన్ను లలరగ
కుటిలకుంతలు లెందరైనయా-పాటలాధరిసాటికలరె ॥ప॥
కమలభవునిరాణికన్న-అమరనాథు దేవికన్న
కమలావాభునిపత్నికన్న-లేమ యెంతో సుటియైనహా! 1
కాలుచీకటిమించు యీసతి-కురులయందము [illegible] గను
మరుని తూపుల చూపులు-వారిజాక్షి నెన్న తరమె॥ 2

(20) హిందుస్థాని—ఆదితాళము.

రావణ॥ వనరుహనేత్రి!-కనకసుగాత్రి!
మానిని వేడెదనిక -
తరుణిరో! నన్ని కసరగున నేలుము ॥ప॥
సీత॥ ఈపగి దేలా?-పాపముచాలా
భూపతియుండిననిక -
తడయక కడువడి పుడమినిశూల్చెద ॥ప॥
రావణ॥ మనోహరీ!-నను నీవిట్లాడ
మన సెట్లొప్పెనీకు?
మానినిమననిక-మనసిజు బారికి 1
సీత॥ దానవాధమ!-ననుఁగోరి
మనగంగవశమె నీకు
తగ [illegible] రయిటు పర-తరుణులఁగోరగ॥ 1

(21) లక్ష్మణుండు—దేవగాంధారి—ఆదితాళము.

ఏమని దెలుపుదు-ఇనకులతిలకనే
నిదుమూర్తారమ-వినుమయ్యా మాక్కు ॥ప॥

(33) ఇంగ్లీషునోటు—ఆదితాళము.

వాలి॥ ఏలరమాటలు? చాలునురా
ఆలసము సేయక-చాలునువే?
సుగ్రీ పట్టెదరా నిను-గొట్టెదరా
గట్టిగ నాకడ-నిలువుమురా
వాలి॥ చక్కగ-పుడమిన్-ద్రొక్కుదురా
సుగ్రీ॥ ఓరి-యిట్టుల-బీరము-లక్కగ
జేర్చెద-కాలుని-చెంతకు రా
వాలి॥ నీచుడ-నీవిక-నీల్గెదురా
సుగ్రీ॥ దక్కవురా-యిక-నిక్కముగ॥ ॥ఏల॥

(34) కానడ-ఆదితాళము.

తార॥ వలదిక నను మగుముకదనంబు-నా-పలుకాదరింపుమిందు ॥ప॥
వాలి॥ విను వినుముదిగులునీకేల? పడిగెలిచివత్తు శుభాలా ॥ప॥
తార॥ చలమున నేగకు-బలియుండ నీనని-కాలమునుగాదివినాథా 1
వాలి॥ వారకపగతుండు-పోరుకుబిలచిన-నూరకయుండంగజాలా 1

(35) అంగదుండు-కమాను-ఏకతాళము.

సురమునీంద్రపన్నుతశౌరి-వరపంకజనయననారీ!
అసురారీ! వనమాలీ! భవహారీ! ॥ప॥
పరిపాలింపుము శ్రీరమణా! పరజేరితినే మా రమణా!
రణభీమ! వరనామ! గుణధామ! ॥ 1

(36) తోడి-ఏకతాళము.

వాలి॥ ఓరోరోరి-పాతకనిలువుము-ధారుణిగూల్చెదనీశిరమున్
దురంబునన్నిక-స్థిరంబుగన్నిలు-రయంబునన్ నిను-
బారిగొందున్
సుగ్రీ॥ చాలున్-పోరా

అంగ—మాయయ్య నాతోడ-నెయ్యము మీరగ
　　జేరి చెక్కిలి ముద్దుగొనుచు-జేరదీయగ వేలనయ్యో!
తార—ప్రాణేశ నిన్నిక-బాసినే ప్రాణముల్
　　నిలుపఁజాలను నిమిషమైన-బలుకరించవ దేలనయ్యో!

(40) చక్రవాకము—ఆదితాళము.

రాఘవా! శ్రితవరదా! రఘుకులదీపక నినుఁబొగడ
జాలు-వారమే-వేదవినుత-మంగళం
నీ-పదసరసిజములనే-సతతము దలఁచెదను
అతిముదమున మదిని-పరాత్పరా! సురార్చితా!
ఖరాంతకా! పాకారివినుతపదాంబుజా!
కేశవా! పశుపతిసఖపవిత్ర! మునిగణనుతచారిత్ర!
దానవకులజయిత్ర! మిత్రా!
సు-బ్బ-రా-య-పా-లా-మంగళముగ.

